శైవప్రచారిణీ గ్రంథమాల. ౧౭

సంపాదకులు.)
కొడిమేల రాజలింగా రాధ్యులు

# శివయోగ సారము

నాల్గవ సంపుటము.





గ్రంథకర్త

కొలని యాది గణపతి దేవుడు



# శైవప్రచారిణీకార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు

| | గ్రంథమాల చందా దారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1 కాశీసారము | 0 1 3 | 0 2 0 |
| 2 భద్రాయురుపాఖ్యానము | 0 8 0 | 0 1[illegible] |
| 3 విద్యాస్థానవినిర్ణయము | 0 8 0 | 0 12 0 |
| 4 శైవసిద్ధాంత దర్పణ. | 1 4 0 | 1 8 0 |
| 5 ఉపదేశకాండము. | 3 0 0 | 3 8 0 |
| 6 సరసహృదయానురంజనము | 1 8 0 | 2 0 0 |
| 7 స్కాందమహాపురాణము, సంభవకాండము సంస్కృతము తాత్పర్యము తోసహా | 3.0 0 | 3 8 0 |
| [illegible]చనము | 1 4 0 | 1 8 0 |
| [illegible]ము | 1 0 0 | 1 8 0 |
| [illegible] | 1 0 0 | 1 0 0 |
| [illegible]నామావళి | 0 3 0 | 0 4 0 |
| [illegible]ము | 0 8 0 | 0 12 0 |
| [illegible] | 0 1 3 | 0 2 0 |
| [illegible]కము | 0 3 0 | 0 4 0 |
| [illegible] | 0 8 0 | 0 8 0 |
| [illegible]లు | 0 3 0 | 0 4 0 |
| [illegible]వాచనము. | 0 2 0 | 0 3 0 |
| [illegible] భాగము | 1 0 0 | 1 4 0 |
| [illegible] భాగము. | 1 0 0 | 1 4 0 |
| [illegible] భాగము. | 1 0 0 | 1 4 0 |
| [illegible] భాగము. | 1 0 0 | 1 4 0 |

వరంగల్ అన్నపూర్ణాయ వలయును.

శ్రీ గురుచరణం.

# రాజపోషకులు.

బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసాక్ రాజా కందుకూరి శాల సూర్య ప్రసాదరావు జమీందారుగారు. విశాఖపట్టణము

# శాశ్వతాభిమానులు.

బ్ర॥ శ్రీ॥ కామర్సు రాజయ్యగారి కొమారుఁడు. వీర రాజగారు కువ్వ.
మ॥ రా॥ కొమరవెల్లి కాశయ్యగారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రామయ్యగారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రత్నంగారు. వరంగల్.
మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్యగారు. వరంగల్.
మ॥ రా॥ కొండూరు రామలింగంగారు. వరంగల్.
మ॥ రా॥ కుంచం దుబ్బయ్య నాగయ్యగార్లు. వరంగల్.
మ॥ రా॥ అప్పని రామయ్యగారు. వరంగల్

# శాశ్వత చందాదారులు.

బ్ర॥ శ్రీ॥ పతిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు. మట్టెవాడ.
బ్ర॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్యఅయ్యవార్లంగారు వరంగల్
బ్ర॥ శ్రీ॥ శివదేవుని వీరేశలింగారాధ్యులవారు. వరంగల్
మ॥ రా॥ అల్వైదన్నగారి నారాయణసింగుగారు. వరంగల్.
మ॥ రా॥ పెద్దివీరయ్యగారు. మద్దిముచ్చాల.
మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు. సిద్దిపేట.
మ॥ రా॥ కొమరవెల్లి శివరాజుగారి అంతయ్యగారు. ,,
మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్యగారు. ములుకనూరు.

శ్రీమేధా దక్షిణామూర్తయేనమః.

శివయోగ సారము

# పీఠిక.

శ్లో. ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేऽర్జున! తిష్ఠతి
భ్రామయన్సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా॥
తమేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత॥ భగవద్గీత.

మానవ జన్మ మన్ని జన్మముల కంటె నుత్తమ మైనది పూర్వజన్మ కృతసుకృత విశేష లబ్ధంబగు నీజన్మమందే మానవులైహికాముష్మిక సుఖంబుల నాశింపక నిత్యానంద మొసంగు మోక్షసామ్రాజ్యమునఁ బట్టాభిషిక్తులగుటకుఁ బ్రయత్నించ వలయును. అట్టి మోక్షము నీశ్వరోపాసనము వలనగాని గలుగ నేరదు. కావుననే "ఓయర్జునా! ఈశ్వరుఁడు సర్వభూతముల హృదయంబున నుండి, యంత్రంబున నెక్కించిన వముల, సర్వభూతములను మాయచేఁ ద్రిప్పుచున్నాడు సర్వభావముల చేత నాతని నే శరణు పొందుము" యని భగవద్గీత యందు శ్రీకృష్ణుఁడు బోధించెను.

అట్టి పరమేశ్వరోపాసనము సర్వప్రాణుల కవశ్యమాచరణీయము. ఆయుపాసనలలోఁ బరస్పర భేదము లనేకములుగఁ గన్పట్టుచున్నవి.

బహువిధ దుఃఖంబుల కాలయమగు సంసార సాగరము నుండి తరించుట కీశ్వరోపాసనయే యాన పాత్రము. శివోపాసనను బోధించు గ్రంథరత్నములలో నీశివయోగ సారమొకటి.

## శివయోగసారము.

ఈ శివయోగసారము పూర్వోత్తర భాగములన ద్వివిధము. పూర్వభాగమున నెనిమిది యాశ్వాసములు గలవనియుఁ — కర్మయజ్ఞము — తపోయజ్ఞము — జపయజ్ఞము అను విషయము లందు నిరూపింపఁ బడినవనియు నీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. విశ్వేశ స్థిర భక్తి వర్ధిలఁగ ను । ర్వింబూర్వ భాగాష్టసం
ఖ్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞముఁ దపో । యజ్ఞ ప్రకారంబు స

శ్రీశైవాగ్ర పీఠమై శివతత్త్వ జపము । జ్ఞానాచార ముంగూడఁగా
విశ్వస్తుత్య గతిం భక్తిబంధ మమరెన్ । విద్వత్సభ గ్రాహ్యమై.

మఱియు నీయుత్తర భాగమును గూర్చి యిటుల నుడువఁబడి

క. ఈయుత్తర భాగంబున । నాయతి రచియించె నాలు । గాశ్వాసములం
బాయక ధ్యాన జ్ఞానము । హేయక్ష ద్వయము యమిజ । నానందముగన్.

ఉత్తర భాగమున నాలుగాశ్వాసములు కలవు. ధ్యాన జ్ఞానల క్షణముల గూర్చియందు విశదీకరింపఁ బడినది.

ఈ శివయోగసారము పూర్వభాగ ముపలబ్ధము గాక పోవు చే నీశివయోగ సార గ్రంథకర్తను గూర్చియే విషయము వ్రాయుట ప్రథమమునందే వీలుకలిగినది కాదు. అందు విషయమై విచారించు డగనే మా॥ రా॥ చిలుకూరి వీరభద్రరావుగారిచే సుజాషి పత్రిక గవస్ గవ సూచిక యందు వ్రాయబడిన అన్నయ దేవుఁడు- విగత చరిత్రా శములను వ్యాసము నందు గణపతి దేవుని జీవిత చరిత్రము గనుగొ గల్గితిని. ఈకవిజీవితమును గూర్చియందిటుల వ్రాయఁబడియున్నది

కొలని గణపతి దేవుఁడు-శివయోగసారము.

“అనియాని గణపతి దేవుఁడు” అను పేరుతో కీర్తిశేషులగు రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులవారు తమయాంధ్ర కవుల చరిత్రములోని తృతీయ భాగమున నీకవిని గూర్చి యిట్లు వ్రా యున్నారు.

“ఇతఁడు శివయోగసారమను గ్రంథమును రచించెను. ఈ వేదాంతగ్రంథము పూర్వోత్తరభాగములు గలదయి, భాగమొకటి నాలుగేసి యాశ్వాసములు గలదిగా నున్న ఈకవి నియోగి బ్రాహ్మణుఁడు; మూలనామాత్యుని పుత్రుఁడు. ఈతని కవిత్వము ప్రౌ ఢమై హృద్యముగా నున్నది. ఈతఁడే కాలపువాఁడో సరిగా తెలియదు గాని యిన్నూ ఱు సంవత్సరములకు ముందే యుండిన వాఁడయి నట్లూహింపఁ దగియున్నాఁడు.”

ఈపై వాక్యములు వ్రాయునాటికి కవివంశ వర్ణనముగల య తారిక లేని శివయోగ సారము యొక్క ప్రతిమాత్రము లభించియుండ ట చేతనుగాఁబోలు పంతులవారింతమాత్రము వ్రాసి యాగ్రంథమ

గోః పూర్వోత్తర భాగములనుండి కొన్ని పద్యములనుదాహరించియుంత పడిన తో దృష్టిం జెందవలసిన వారయిరి. పూర్వభాగము నాలుగాశ్వాసములని వ్రాసిరిగాని యొక మిదాశ్వాసములు గలవు.

కవివంశ మామూలుగ్రంథముగా వర్ణింపఁబడిన యవతారిక గల పూర్వ భాగముయొక్క ప్రతియొకటి నామిత్రులగు శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఏ. ఎల్. టి గారి కిటీవల లభించినది. నాప్రార్థనము పైని నేనాకవి వంశ చరిత్రమును వ్రాసికొనుటకై దయతో నొక మాతృప్రతి నొసంగిరి. అందులకు వారికి నాకృతజ్ఞతా వందనముల దెలుపు చున్నాను. ఇన్నూరు సంవత్సరముల క్రిందట వ్రాయఁబడిన గ్రంథమగుటచేత మిక్కిలి శిథిలమై యున్నది. నడుమ గొంతభాగము నశించి పోయినవిగాని తక్కువలు కుప్పలుగా నున్నను కవివంశ వర్ణన భాగము మాత్రము పోలేదు. ఈకవి శిఖామణి కౌండిన్యస గోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఆదిమూలనామాత్యుని పుత్రుఁడు; శ్రీగురుచన్న సదాశివ యోగీంద్రుని శిష్యుఁడు; శివభక్తుఁడు. ఆశ్వాసాంతముల గద్య మిట్లున్నది.

"ఇది శ్రీగురుచన్న సదాశివ యోగీంద్ర పాదారవింద సుధాకరాయమాన శివ ... సమారాధన కొలనియాది మూలనామాత్య పుత్ర, అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతిసు ... ముఖ కవిజనమిత్ర సరసకవిత్వ విరచిత ప్రభావ గణపతిదేవ శివయోగసారంబు."

ఈపైగద్యములోని "కొలనయాది మూలనామాత్యపుత్ర" యనునది వీరేశలింగముగారి ప్రతిలో 'కొ' అనునక్షరము విడిచిపెట్టి 'లని యాది మూలనామాత్య పుత్ర' అని వ్రాయఁబడి యుండుటచే గాఁబోలు దానిని గాంచి పంతులవారు అని, 'యాది మూలనామాత్య పుత్ర' నిపఠించి 'అనియాది' అనుదాని నింటిపేరుగా భావించి 'అనియాది గణపతిదేవుఁడు' అనియు 'మూలనామాత్య పుత్రుఁడు' అనియు వ్రాసియున్నారు. ఇది పొరపాటు గణపతిదేవుని తండ్రిపేరు ఆదిమూలనామాత్యుఁడు. ఇంటిపేరు కొలనివారు. ఈవంశమువారికి మొదట 'ఇందులూరు వారని యింటిపేరుండి తరువాత 'కొలని' వారని యింటిపేరు గలిగి

న విధ మీ గ్రంధములోని వంశచరిత్రమున వక్కాణింపఁ బడినది. ఈ వంశమునకు మూలపురుషుఁడగు నానగౌర్యుఁడను నాతఁ డిందులూరు విభుఁడని.

"ఘన. శ్రీభఁ గౌండిన్య మునీంద్ర గోత్రమున నాపస్తంబ సూత్రింబునం
దభవాఘ్రి ద్వయసేవకుండయి ఘనుండై యన్మకొండకా పురీ
విభవంబొందఁగ నిందులూరి విభుఁడై విఖ్యాతినిం జెందె నీ
తిభయాత్ముండగు (నానగౌర్యుఁడు?) క్షత్రోదారుండు ధీరుఁడౌగికా.

అను పద్యమునఁ జెప్పఁబడి యుండుటచేత నీతని వంశమువారికి నిందులూరి వారను పేరుగలిగినదని మన మూహింపవచ్చును. ఇతని మనుమఁడగు సోమామాత్యుఁడు కొలని మండలీకులను బాఱఁదోలి కొలనువీడును వశపఱచు కొనుటచేత కొలని సోముఁడని ఖ్యాతిఁ గాంచినట్లుగా,

ఆ పె లీలఁ గొలని మండలీకుల వెసఁదోలి। కొలనువీడు దాను గొనుటఁజేసి
శాక తీశుఁడైన గణపతి (యుండను)। కొలని సోముఁడనగ వెలసె జగతి."

అను పద్యమునఁ జెప్పి యున్నాఁడు.

ఇయ్యది క్రీ. శ. ౧౨౭౮ వ సంవత్సర ప్రాంతమున నడచిన ప్రసిద్ధమైన చరిత్రాంశము. ఇప్పటినుండి ఇందులూరి సోమమంత్రీశ్వరు వంశము వారు కొలనువారని వ్యవహరింపఁ బడుచుండిరి. మనకవి కాలమునాటికి కొలను వారను నింటిపేరు నిలిచినది.

## ఏలూరే కొలనువీడు

నిజాము రాష్ట్రములోని కొల్లిపాకయె కొలనువీడని పెక్కండ్రు భ్రమ పడుచుందురు. క్రీ. శ ౮ వ శతాబ్ది మొదలుకొని పదునేనవ శతాబ్ది వఱకును ఏలూరునకు బూర్వపు నామము కొలను వీడని యనేక శాసనములలో వక్కాణింపఁ బడియున్నది. తెలుఁగున కొలను కొలను వీడనియును, సంస్కృతమున సారసిపురమనియు, కమలాకరపుర మనియును, పద్మినీపుర మనియును వ్యవహరింపఁ బడుచు వచ్చినది. మహమ్మదీయుల పరిపాలనము వచ్చిన నాటనుండియు నేలూరని

పాలింపఁ బడుచుండెను గాని యంతకుఁ బూర్వమున నేలూరని యెచ్చ
లూరను వ్యవహరింపఁ బడినట్టి ప్రమాణము గానరాదు. ఆకాలమున కొలను
ను జలదుర్గములలో శ్రేష్ఠమైనదిగా నీగ్రంథమున వర్ణింపఁ బడినది. ఈ
ను కొలను నడుమఁ గట్టఁ బడియుండుటచేత కొలను వీడని చరిత్రము
ప్రసిద్ధి గాంచినది. చాళుక్యాంధ్రుల పరిపాలన కాలమున రాజమ
హేంద్రవరము రాజధానీ నగరముగాఁ జేయఁబడిన వెనుక కొలను వీ
డు చాళుక్యాంధ్ర రాజ ప్రతినిధులకు ముఖ్యస్థానమై యలరుచుండెను.
కాకతీయాంధ్ర చక్రవర్తుల కాలమునందుఁ గూడ రాజప్రతినిధులకుము
ఖ్యస్థానముగ నుండెను. చాళుక్యుల పరిపాలన మంతరించిన వెనుక నీ
దుర్గమును బరిపాలించుచుండిన తెలుఁగు నాయకులు మండలేశ్వరు
లు, స్వతంత్రులైరి. కాకతి గణపతి దేవచక్రవర్తి కాలమున ఇందులూరి
వంశ రాజను సోమమంత్రీశ్వరుఁడు క్రీ. శ. ౧౨౩౮ వ సంవత్సర ప్రాం
తమున నీ మాండలిక రాజుల వశమునుండి పాలుద్రోలి యీ భాగము
ను కాకతీయాంధ్ర సామ్రాజ్యముతోఁ గలుపు కొనియెను.

## గురుస్తుతి

ఇతఁడు తనగ్రంథము మొదట దేవతాస్తుతికిఁ బూర్వము నీక్రింది పద్యములో గురుస్తుతి గావించి యున్నాఁడు.

ఉ. శ్రీయుత సర్వలక్షణ వి, శిష్టగుణాస్పదుని స్సదాశివ
ధ్యానవిలీనమానసు ని, రంతరయోగ సుఖాంతరంగు స
జ్జ్ఞానవిమోదివాకరు న, జస్రము నాకయ దేశికోత్తముం
బూని మదీయ వాక్ప్రసవపూజనలన్మది తొత్మ్యఁ జేసెదన్.

## దేవస్తుతి.

మఱియు నితఁడు గురుస్తుతిఁ జేసిన వెనుక గణపతిని, విఘ్నస
కాశీవిశ్వేశ్వరుని, ఆదిదైవమును, పార్వతిని, వీరభద్రుని వరుసగా స్తుతించి
యున్నవాఁడు. గణపతిని గూర్చి వ్రాసినపద్యము పూర్ణముగాఁ జెడిపో
యినందున నిందువిడిచి వేయఁబడినది.

చ. ప్రోడిసెసు నీవునైన నొక, పువ్వుమ్మునేమునైన నాత్మసె
ప్పుడుఁ దన కిచ్చు భక్తుల క, పార సురేశ్వర రాజ్యసంపదల్
తడయకయిచ్చు మార్మికుఁల, దైవము (విభ్ను?) సదాశివేశ్వరుం
డెడపక యెల్లనాఁడు మద, భీప్సిత సిద్ధికరుండు గావుతన్.

ఉ. అంబుజముం ద్రిశూలము మ, హామణిహారము [పాప] పేరు పీ
తాంబరము న్గజాజినము, నబ్జవిలోచనము న్దినేశ నే
త్రంబును [ ] సుధారసవర్ణము గల్గునాది దై
వంబును ( ) భీవ, చాయ శిరీయఁదలంచి గొల్చెదన్.

ఉ. గట్టిగ తండ్రిచేత నెస, కంబున పూజలఁ గొన్న పట్టికిం
బుట్టిననాట [ ] ప్ర, భుండగు పట్టికిఁ జూపు తల్లియై
పట్టున రాజశేఖరుని, పట్టపుదేవి కృపాతరంగియై
నెట్టన శైలపుత్రి కరు, ణింపుచు మన్మతిఁ బాయకుండెడున్.

క. శ్రీవీరభద్రదేవుని । భావంబునఁ దలఁచి మ్రొక్కి, ప్రమథుల శివభ
క్తావలులఁ దలఁచి కవితా । ప్రావీణ్యత శివకవీశ్వ, రతతిఁ దలంతున్.

## కవిస్తుతి

అటుపిమ్మట నీకవి గీర్వాణకవుల నాంధ్రకవుల నీక్రింది పద్య
లలో నభినుతించి యున్నవాఁడు.

సీ. వ్యాసుని రచనావి, భాసుని నభినవ । కవితాను నోల్లాసు, కాళిదాసు
భద్రసారస్వతో, న్నిద్ర నాశివభద్రు । పటుకళాపాణిణు, భట్టబాణు
భూరిమనోబ్ధి ప్ర, భారవి భారవి । యద్భుతానల్ప శ, బ్దాఘు మాఘు
సుమనః ప్రసాదైక, సుశ్లోకు వాల్మీకు । భువనపుణ్యు మయూర,కవివరేణ
తే. వీరినెల్లను సంస్కృత విమలభాణు । లనిప్రశంసించి మఱియును నంధ్ర కా
పదముదీర్చిన నన్నయభట్టుగారి । నుభయకవిమిత్రు పేర్మిన, నభినుతింతు.
క. అసమ శివభక్తి రసమా । నసునిం బాల్కురికి సోమ, నాథునిఁ గవిరా
జ సమున్నత యశునఘు ప్రసాదియగు చక్రపాణి, రంగన గొలుతున్.

ఈగణపతి దేవకవి యెఱ్ఱాప్రగ్గడకుఁ గొంచెము తర్వాతను
సోమని కాలమునను నున్న వాఁడగుటంజేసి యాంధ్రకవులలోన

మతిక్కన్నలను, పాల్కురికి సోమనాథుని మాత్రమే యభినుతించి యు
న్నాఁడు.

## ఆ శీ ర్వ చ న ము.

కవిస్తుతి ముగించిన వెనుక శివకవులను, శివభక్తులను, శివయో
గులను నీక్రింది పద్యములలో నాశీర్వదించి యున్నవాఁడు.

క. భద్రంబగునో సమితికి। భద్రంబగు సర్వజీవ, పంక్తికి మిగులన్
భద్రంబగు శివశాసన। ముద్రాంకితులైన భక్త, ముఖ్యుల కెల్లన్.

క. శుభమగు వేదంబులకును। శుభమగు శివసంహితలకు, శుభమగు మతి దుష్ట
త్రిభువనములలోఁ గలుగు శి। వభక్త సంతతికి నిక్క, మంబుగ నెప్పుడున్.

క. మంగళమగు నానావిధ। సంగవిత్యాగులైన, చలవేదశర
స్సంగత వాక్యసుధాసి। క్తాంగులయిన యోగిజనుల, కనవరతంబున్."

## గ్రంథప్రాశస్త్యము.

మఱియు నీమహాకవి తన గ్రంథముయొక్క ప్రాశస్త్యమును, ప్ర
యోజనమును నీక్రింది పద్యములలోఁ జెప్పియున్నవాఁడు.

చ. సతత మనోజ్ఞమై విబుధ, సమ్మతమై రసవంతమై మహా
ద్భుతకరమై (భవార్తపకు), బోధకమై పరమార్థమై జగ
ద్ధితమును నైన కబ్బము న, హీనమతి న్రచియించినం గదా
యతుల పురాణశాస్త్ర విధి, థాగమ పారగు లుల్లసిల్లుటల్.

వ. కావున.

క. మోక్షప్రదానకరమై। సాక్షాదాగమ పురాణ, సారంబై ప్ర
త్యక్షప్రమాణమై యస। దృక్షంబగు కృతిరచింతు, దృఢచిత్తుఁడనై"

తరువాత నీకవి తన యన్వయమును నంబుజాకరముతోఁ బోల్చి
యిట్లభి వర్ణించి యున్నాఁడు.

"ఉ. తమ్ములతోడఁగూడి సము, దాత్తతఁ శ్రేష్ఠరకంబుఁ జెందితా
నెమ్మెయి సద్విజావలుల, కెల్లను చల్లని యిల్లుగాన ని
త్యమ్మును [ ] కువల, యప్రియమై బహు జీవనంబుతోఁ
నిమ్ముల నంబుజాకరము, నెంతయు భోఁజి మదన్వయంబుకున్."

# కవివంశము.



మహావిష్ణువు
బ్రహ్మ
కౌండిన్యమహర్షి
ఇందులూరిసానగౌర్యుడు (1)
పెదమల్ల విభుడు
చిన్నమల్లదేవుడు (2)
[3] సోమమంత్రి
పెదగన్నభూపతి (3)
(4) మన్మగన్నడు
అన్నయదేవుడు (4)
[కాకతిరుద్రాంబఅల్లుడు]
(5) కొలనిరుద్రదేవుడు
ఇమ్మడిరుద్రుడు
ముమ్మడిరుద్రుడు
గణపతి (6)
జొబభుడు
[7] అన్నయదేవుడు
రుద్రదేవుడు
అదిమాలుడు
కొలనిగణపతిదేవుడు [8]
(శివయోగసార గ్రంథకర్త)

# గ్రంథాంకితము.

కొలని గణపతి దేవకవి తనశివయోగ సారంబను వేదాంతగ్రంథమును దనకు మేనత్త కుమారుండును, ఇందులూరి నాగచమూవరు పుత్రుడును, చన్న సదాశివ యోగీంద్రుడను ప్రఖ్యాతి నామాంతమును వహించిన వాడును, దనకు గురువునగు ఇందులూరి నాకమారాధ్యునకు నంకితము గావించెను.

కృతికర్తయొక్కయు, కృతిభర్తయొక్కయు నింటి పేరిందులూరివారై యుండఁగ నెట్లీయుభయ కుటుంబములకు సంబంధములు గలసినవని చదువరులకు సంశయము గలుగవచ్చును. వీరికింటి పేరొక్కటియైనను గోత్రభేదము గలదు. కృతికర్తది కౌండిన్యస గోత్రము. కృతిభర్త హరితస గోత్రము. కవి తనగ్రంథమునం గృతినాథుని వంశము నిట్లభివర్ణించి యున్నాడు.

ఆ. హారితగోత్రజాతుఁ, డగుచు నాపస్తంబ। వితతసూత్రమునను, వేగినాటి
భూమిలోఁ బ్రసిద్ధిఁ, బొందెను నాకనా। ర్యుండు సుజనబంధు, మండనుండు.

క. ఆనాకన పెగ్గడయను। నూనుండై బల్లపెగ్గడ, సుధి యొప్పారెం
ధీనిధినిరవద్యాక్షర। మానవనాథులకుఁ దాన, మాత్యుండగుచున్.

ఆ. ఆతని సుతుండు వరశి, వాచారసక్తుఁడు। జననుతుండు ధైర్య, శౌర్యయుతుఁడు
జగతి నిరుదపాలి, చక్రవర్తుల రాజ్య। మహిమ దాల్చె నాగ, మంత్రి యనఁగ.

క. ఇమ్మల నాగయ మంత్రికిఁ। గొమ్మాంబకు నాకరాజు, కూరిమి సుతుఁడై
యిమ్మహిలోపల వెలసెను। సమ్మతుఁడై యాభవుపాద, సంసేవకుఁడై.

ఆ. భూరిసద్గుణముల, పొగడఁగ నెగడు కొ। మ్మాంబసతియు బెండ్లియై గృహస్థ
ధర్మమెల్లఁ జెప్పెఁ, దనయందు గలుగంగ। మెలఁగె సకల బంధు,మిత్రుఁడగుచు.

క. తద్దంపతులకుఁ బుత్రకు। లిద్దఱు నాగయయు వల్ల, భేంద్రుఁడు ననఁగాఁ
దద్దయువర్ధిలి రందును। బెద్దయయిన నాగమంత్రి, పృథ్వీస్థలిపై.

ఆ. జనులెఱుంగ రాయ, చౌహత్తమల్లుఁడై। వెలమకొలని రుద్రి, విభుని పుత్రి
తనకమైన గణప, తి క్షితిపతిపుత్రి। గౌరి బెండ్లియయ్యెఁ, గారవమున.

సీ. బాల్యమునను దాన, పారధర్మంబులా। ర్జించె ధార్మికులు వ, ర్ణించుచుండ
న్యాయమార్గమునను, ధనార్జనం బొనరించి। బంధుమిత్రుల బాల్య,సరళి (బో)చె

కామ్యార్థ్యర్థించుచో, గామినీమకరాంకుఁ। డతఁడె పొమ్మనఁగఁ బ్రస్తుతికి నెక్కి
కాశిలోఁ గదలక, పాశుపతవ్రతి। శీలుఁడై మోక్షమా, ర్గించి మించె
తే. గీ. కాన నర్మాన్నకామమో, క్షములఁ సుకర। మనను పొగ్గించి సాగచ్ఛమూవరం
తజ్ఞుఁడై తుదినాశ్రమాం, తరమునేపి। యాతఁడు శైవ గురునామ, ధేయుఁడయ్యె
క. ఆనాగయ విభువయసరు। మానినియై యొప్పు గౌర, మకుఁ బ్రియనూనుం
డై నాకయ్య యనంగను [ననూన మహిమంబు నొప్ప] నవనీస్థలిలోన్.
సీ. శ్రీగురుఁ డందగు యాజు, శైవగురువుల నం। దనుఁడను (పి)యశివ్యు, లతఁడు (?)
పూర్వకాలమునందు, భూతేశుశంకరుఁ। బూజింప నేర్పుచు, బుణ్యుఁడట్టి
సకలవేదపురాణ, శాస్త్రార్థ సారసం। విజ్ఞాతయైన స, ర్వజ్ఞుఁడట్టి
శ్రీగురు కృపఁజేసి, సిద్ధమతంబున। నధ్యాత్మ పంవేత్త, యయ్యెనట్టి
తే. గీ. కాశికాదేశముఖ్య ప్ర, దేశములఁ జ। రించి కులకోటులను నుద్ధ, రించె చ
గురుసదాశివ యోగినా, బరగునట్టి। [యిందులూరి నాకయ మంత్రి,] కెవ్వరీ
ఆ. వె. పూడికొమ్మరాజు, పుత్రి పతివ్రతా। తిలకమైన గౌరి, దేవి మొదట
పిదప లక్ష్మిదేవిఁ, బెండ్లియై ఘనుఁడ। యలర వెలసె నమ్మ, హాత్ముఁ డిలను.
సీ. తన మేనమఱదియౌ, ధనశిష్యుఁడును లోక। మాన్యుండునైన కాం, డిన్యగోత్ర
సురుచిరాపస్తంబ, సూత్రుని నిదులూ। రన్నయదేవుని, యన్న మనవ
గన్నయ రుద్రభూ, కాంతుని గణపతి। దేవుని యాదిమూ, ర్తి కవి సద్గు
ణాస్పదమగు లక్క, మాంబకుఁ బుత్రుని। దిర మొప్ప గణపతి, దేవవిభుని
తే. గీ. సహిత గణపల్లురాయ చా, హ త్రమల్లు। నభినవాకారు ధీయుత, న్యాంగనా
సోదరుని నన్ను రావించి, యుచితవృత్తి। నప్పుడీయ ప్రణామంబు, లాదరించి

కవికాలనిర్ణయము.

క్రీ. శ. ౧౨౯౫ మొదలుకొని ౧౩౨౫ వఱకును బరిపాలించి
కొండవ ప్రతాప రుద్రదేవ చక్రవర్తికి రాజప్రతినిధిగా నున్న కాలని
ద్రదేవునకు మనుమని కుమారుఁ డగుటచేత శివయోగసార కృతికర్తయై
న కాలని గణపతిదేవకవి తరువాత డెబ్బది లేక యెనుబది సంవత్సర
ముల కనఁగా క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరముల ప్రాంతమున నుండెనని
స్పష్టముగాఁ జెప్పవచ్చును.

సుభాషి.

## కవిత్వశైలి.

ఈ కవీశ్వరుని కవిత్వశైలిని కనుగొనుటకుఁ బై పద్యములే చా యున్నను నీయుత్తర భాగమందుఁగూడ మచ్చునకు నాలుగు పద్యము యఁబడుచున్నవి.

చ. ముదిమి జనించు వెంట మల, మూత్రము లుండెడు మాటుగుంటయై
న్మదముల ప్రోవు పాతక స, మాజము తావు తెవుళ్ల వేలమా
పదలకు మూలమాత్మ పఁ, పంసుల తోలము దుర్గుణావలుల్
చెదరక యున్న కందువ వ, చింప శరీరము కాదె చూడఁగన్. ఉ. ఆ ౧౫౭౮

సీ. విద్యార్థినైయుంటి, వేధించి కలిగిన విద్యాధికులఁగని, విసివి విసివి
ధనము నుపార్జింపఁ, దలపోసి కలిగిన। ధనరత్నణముకై, తలరి తలరి
కులభావ మేమికిఁ, బలగించి కలిగిన, ననుకూల గాకున్న, యలసి యలసి
సంతతి లేమికిఁ, జింతించి కలిగినఁ। గొఱగాని సుతులచేఁ, గుందికుంది
గీ. లేమియెంతయు దుఃఖమా, లేమికంటెఁ గలిమి నిమ్మడి దుఃఖమై కానఁబడఁగఁ
గాపమును బొందకెపుడు నిర్ద్వంద్వవృత్తి। బరఁగువాఁడు పరబ్రహ్మపదవిఁ బొందు.

ఉ. అక్కట నిర్దయంబునవు, లంచు, ననాథలు మేకపోతులన్
బ్రక్కకు జేరిచి పంజరములు, సొక్కుచు నిక్కుచుఁ దిండు కొల్లఁకన్
గ్రక్కున నట్టి మేఁకలకుఁ, గాలము గూడిన వెన్కఁ గాక వా
రెక్కడ నీ మోక్షసౌఖ్యమది, యొక్కఁడనీఁ జిత్తము నందలంపఁగన్.

సీ. భ్రూమధ్య మంబాడి, గామిఁదనిట లాగ్ర। మంతంబు గానంబు, రాలయంబు
మారుతం బచటు హా, కారాన్వితంబుగాఁ। గకుఁదిరంబుఁగ నిల్పి, కాలకంఠు
సోమకలావతం, సునిసోమ నరార్యాగ్ని। నేత్రుమమామరుత, గాత్రు వధివు
బంచాననుఁ ద్రిశూల, పరశుముఖ్యాయుధు। స్వానద్విపంచహ, స్తారవిందు
గీ. నధిక తరవర ప్రముఖంబు, నఖిల తత్త్వ ములకు నధి తత్త్వమైనని, ర్మలుని శివుని
బిందుగగన స్వరూపుఁడం, దందు తలఁపు చుండు నెవ్వఁడు సహజము, క్తుండతండు॥

### నూకనారాధ్యుని గృహనామము.

శ్రీగురుచెన్న సదాశివ! యోగీంద్ర కులాబ్ధి చంద్ర! యోగివినుత! శై
వాగమసారజ్ఞా! నాగార యిడూరి నూక! నారాధ్యవరా.

నూకనారాధ్యుని యింటిపేరు ఇందు లూరి వారని శ్రీ రా ముకూరి వీరభద్రరావుగారుదహరించినలోఁగడపద్యములవలన దెలియు

చున్నది. ఈశివయోగసారము నందలి యుత్తరభాగ ప్రారంభమునం
పైపద్యము వలన" ఉడూరి" వారని తోచు చున్నది. కొన్ని తాలప
గ్రంధములందు-"యాడూరి" యనిగలదు. "శైవాగమసారార్థజ్ఞా"య
నంత వఱకు నిలిపి కొందఱు- "నాగర యాడూరి" వారని యను
న్నారు నాగారమను పేరుగల గ్రామములు నిజాం రాష్ట్రమునగలవు. మ
కులభించిన తాలపత్ర గ్రంధములం బట్టివిచారింపఁగా"నాగరయుడూ
యునియొక ప్రతి యందును, "నాగర ఉఱాడూరి" యని మరొక ప్ర
యందును గలదు. "శైవాగమ సారార్థ జ్ఞానాగార" యనునంతవరకు
దము విభజించినచో, నూతనారాధ్యుని యింటిపేరు. ఉడూరివార
యో లేకయాడూరి వారనియో చెప్పవలసివచ్చుచున్నది. అటులయి
చో మ॥ రా॥ చిలుకూరి వీరభద్రరావు గారువ్రాసినటుల గోత్రభేద
కాక-గృహనామభేదము కూడయున్నటులఁజెప్పవచ్చును.

ముగింపు

పూర్వభాగము మాకుఁదొరకమిచే గణపతి దేవుని యింటి
రు కొలనివరాది యనిప్రకటింప వలసి వచ్చినది. మాపాఠకులు "కొల
యాది గణపతి దేవుఁడు" అనుచోట కొలను గణపతి దేవుఁడు అనిగ్ర
హించు కొందురుగాత. మాకు శివయోగసార తాలపత్ర గ్రంధము ల
సంగిన బ్ర శ్రీ ఘట్టిపల్లి నాగమల్లయ్య అయ్యవార్లంగారికిని, వె
గడప మల్లయ్య అయ్యవార్లంగారికిని, గణపతిదేవునిజీవితమును*సుభ
షిపత్రికాముఖమునఁబ్రకటించిన మ. రా. చిలుకూరి వీరభద్రరావు గా
రికిని, ప్రథమమునసే తాలపత్ర గ్రంధములఁ బట్టి సవరించి యొసఁగి
న బ్ర. శ్రీ. కొత్తపల్లిసూర్యారావు గారికిని కృతజ్ఞులము. ఇట్టి గ్రంధ
మును ముద్రింపఁ గలుగు భాగ్యము మాకు గల్గినందులకా సర్వేశ్వరు
ని కనేకధన్యవాదము లొసంగు చున్నారము.

ఇట్లు,

విద్వాన్. ముదిగొండ వీరేశలింగశాస్త్రి.

---

*ఈసుభాషిపత్రిక రాజమహేంద్రవరము నుండి మ. రా. పందిరి మల్లికార్జు
న రావుగారి సంపాదకత్వమున 1927 అక్టోబర్ నుండి వెడలు చున్నది.

# విషయసూచిక.

శివయోగసారము — ఉత్తరభాగము — చతుర్థాశ్వాసము.

విషయము

విషయము.



సమాప్తము.





శ్రీ రాజేశ్వరాయ నమః

# శివయోగసారము

## ఉత్తరభాగము.

### చతుర్థాశ్వాసము.





మద్వేదాంత రహ
స్యాశ్రేయ మనోన్మనీ సు ◊ ఖాస్పద సద్వి
ద్యామండిత! నిర్మల ని
ష్కామాత్మక! నూకనార్య ◊ సద్గురునాథా!

తా. వేదాంత రహస్యమైన మనోన్మని యొక్క- సుఖమునకు నిలయమైన జ్ఞానవిద్యచేఁ బ్రకాశించు వాఁడా! నిర్మలము- కామరహితము-నగు నాత్మగలవాఁడా! ఓనూకనారాధ్య వర్యా!

ఆ. వె. శైవయోగశాస్త్ర ◊ సార సముచ్చయ
ప్రకరణముల యర్థ ◊ భావ మెల్ల
దెనుఁగు కవితఁ దేట ◊ తెలివిగానే భవ
దాజ్ఞ విన్నవింతు ◊ నవధరింపు. ౧

తా. శైవుల యోగ శాస్త్ర రహస్యము లన్నియు- (దేట తెలుఁగున నీయాజ్ఞ విన్నవింతు. అవధరింపుము.

## —*రాజయోగ ప్రాశస్త్యము.*—

ఉ. ఉత్తమకృత్యమైన హఠ యోగము కంటెను రాజయోగ మ
త్యుత్తమమై ముముక్షుజన యోగ్యమనం దగుఁ దత్ప్రవీణ
సత్తముఁడైనయోగి శివుఁ జయ్యనఁ గన్గొని తన్మయాత్ముఁడౌ
నెత్తఱి నన్యమార్గముల నిట్టిమహత్త్వము గల్గ నేర్చునే.

తా. యోగములలో మను, లయయోగముల కన్న హఠయోగము ముత్తమము. కంటెను రాజయోగ ముత్తమము. ఇది మోక్షమును గోరువారికి నుచితమైనది. ఎవ జయోగ మార్గమున నడచుదురో, వారనతి కాలంబుననే శివుని గాంచి తన్మయులై వుదురు. మార్గాంతరము లందిట్టి మహిమ లేదు సుమా?

క. కావున శివయోగమనం
గాఘలసిల్లుచు నశేష కర్మహరంబై
జీవన్ముక్తి సుఖప్రద
మై వెలయుఁ రాజయోగ మాశ్చర్యముగన్.

తా. కాబట్టియే సమస్త పాప కర్మల హరించుచు- జీవన్ముక్తి నొసంగుచు ఖప్రదమై యీ రాజయోగము శివయోగమని ప్రసిద్ధిగాంచినది.

క. ఆయాసమేమియును వల
దే యనువుననున్నఁ జనుమ హిత గురుకరుణన్.
ధీయుక్తి గల్గెనేనియు
నేయోగము రాజయోగ మెనయున వచ్చున్.

తా. దీనియందు శ్రమపడ వలసిన యవసరము లేదు. గురుకరుణాపాత్రుఁడై శల్యమును సంపాదించిన జాలును. ఏయోగము దీనితో సమానము గాదు.

ఉ. సాధకులైన వారలకు సాధ్యము మోక్ష సుఖంబు దానికిన్
సాధక యాగ మార్గముల సారతరంబగు రాజయోగ మం
ద్రీధరణిన్ బుధప్రవరు లిందురు సాధన మాహరంబగున్
వ్యాధి విపజ్జరామృతి మహోత్తర దుఃఖములన్ హరించుచున్

తా. అభ్యాసకులకు సాధింపఁ దగినది మోక్షము. ఆమోక్షమునకు సాధనము

యోగము. ఈ రాజయోగమునకు సాధనము హఠయోగము. ఈహఠయోగము వ్యాధి
నిమి మొదలగువాని నపహరించుటచేదీనికి హఠంబని పేరుగల్గినది.

## అష్టాంగయోగములు రాజయోగాభ్యాసమున కనుకూలమగువిధము*

వ. పూర్వోక్తంబులైన హఠయోగంబు నందలి యష్టాంగయోగంబు
లును నిరాయాసకరంబున రాజయోగాభ్యాసంబున కనుకూలం
బగునట్లుగా సంక్షేప రూపంబునఁ దత్త్వవిదులు చెప్పుదురు అవి
యెయ్యవి యనిన. 2

తా. పూర్వము హఠయోగమునఁజెప్పఁబడినయష్టాంగములును రాజయోగంబునకను
గలిందు నటులఁ దత్త్వజ్ఞులచే సంగ్రహముగ వచింపఁ బడినవి. వాటినివచించెను.

—*. యమనియములు *—

సీ. ఆహార నిద్రేంద్రి । య శరీర బహువిధ
వ్యాపార జయము శీ । తాతపముల
జయమును, నిశ్చల । శాంతియుగూడ య
మంబయ్యె మఱినియ । మంబనంగ
గురునాధు నందు నే । కాంతయులేని స
ద్భక్తియుఁ బరతత్త్వ । పదమునందు
ననురక్తియును దనం । తన వచ్చినట్టిలా
భంబున సంతుష్టి । ప్రబలుటయునుఁ
తే. గీ. గడఁగి నిస్సంగ గతియు నే । కాంతవాస
పరతయు మనోనివృత్తియుఁ । బటువిరక్తి
భావమునునయ్యె యోగత । త్పరులుదీని
వరుసనెయ్యన సాధింప । వలయు మొదల. 3

తా. ఆహారమును- నిద్రను-ఇంద్రియములు- శరీర వ్యాపారమును- శీతాతపముల
ను- జయించుటయును- నిశ్చల శాంతిగలిగియుండుటయు- యమమనఁబడును.

గురువు నందు సంపూర్ణభక్తి, పరతత్వమం దనురక్తి, దాని యంతకు వచ్చిన లాభమును సంతృప్తి, నిస్సంగము- ఏకాంతముగ నుండుటయు- మనో నివృత్తియు- వి... యు నియమమనం బడును.

## ఆసనము

క. ఆసనమనందగు నిష్ట సు
ఖాసనమున సంతతంబు నాత్మాకృతి యం
దాసన్నత్వము సర్వో
దాసీనత గలిగియున్న దలంపుడు జగతిన్.

తా. తన కిష్టమగు సుఖాసనమునం గూర్చుండి యాత్మనవలోకించుచుండుట సర్వమునందు నుపేక్షాబుద్ధియు నాసనమనం బడును.

## ప్రాణాయామము.

తే. గీ. పరగ రేచక పూరక కుంభక సమేత
మైన నిశ్వాసమున నప్ర యత్నమునను
బ్రాణమందిరము సేయుట జగ త్ప్రతతి మిథ్య
యనితలంపఁ బ్రాణాయామ మండ్రు బుధులు.

తా. జగత్తును మిథ్యయని తలంచుటయు, రేచక పూరక కుంభకములలో ... డి కొనిన నిశ్వాసము నందు నప్రయత్నముగఁ బ్రాణ వాయువును స్థిరము గాఁ జేయుటయు ప్రాణాయామ మనఁబడును.

## —* ప్రత్యాహార ధ్యాన స్వరూపములు *—

సీ. అంతర్ముఖంబైన యమల చిత్తమునఁ జై
తన్యజాలములు వా తంబు లగుట
బహువిధంబుల సము ద్భవమునొందు మతిని కా
రములు వర్జించి యే ర్పఱచుట ప్ర
త్యాహారసన మొలిం గావింప నేర్పటికి

లాగు ప్రత్యాహార లక్షణంబు.

విమల సోహంభావ ♦ మునను గాంభీర్యమైన య
ద్వైత ముఖ్య స్వభా ♦ వంబు కలిమి
గీ. యొందునైనఁ బ్రకాశించు ♦ నెట్టిదాని
దత్త్వరూపము యనిచూచు ♦ తలపు సర్వ
భూతముల యందు సమదృష్టి ♦ భూరికరుణ
ననదృశాత్మానుభవ తృప్తి ♦ ధ్యానమయ్యె ౧౧

తా. ఆతి దుఃఖములుగల చిత్తమునందు, ప్రాణిసమూహ మునేకము వాసమైనట్టుల ననేక విధంబుల మనంబునఁ గలుగు వికారంబులఁ జర్పించి యుక్తాయుక్తములాలో చుచుండును, జీవరకు వికారము లన్నియుఁ బోఁజేసి కొనుటయును, బ్రత్యాహార మనఁబడును.

తా. సోహంభావబుద్ధిగలిగి యద్వైత భావనచేత, సర్వమును బరశివ తత్త్వముగా దలంచుచు, సర్వభూతములందు సమదృష్టియు, సమానప్రేమయుఁగలిగియు, ఆత్మానుభవము తృప్తి గలిగియుండుట యే ధ్యానమనఁబడును.

—✻ ధారణస్వరూపము. ✻—

చ. వెలుపల లోపలం గలిగి ♦ విస్ఫుటమై పరతత్త్వ మెప్పుడున్
వెలుగుచునుండఁ గన్గొని వి ♦ వేకముచేతఁ దదీయధారణం
బలవడ నాచరించుట మ ♦ హాత్ములు ధారణమండ్రు వెండియుం
జలనము లేని చిత్తముని ♦ జంబుగ ధారణ నాఁగఁజెల్వుగున్. ౧౨

తా. బాహ్యాంతరములందు ప్రకాశించుచున్న పరశివతత్త్వమును గుర్తెరిగియా మును ధరించుటయే ధారణయనఁబడును. మఱియు, నిశ్చల చిత్తము గూడ ధారణయ గును.

✻ సహజత్వ స్వరూపము. ✻

వ. శ్రితని యతిర్గన్ నిజానుభవ ♦ శీలతయున్ బహుతత్త్వ సామ్యసం
స్కృతియును నట్టిసంస్కృతికిఁ ♦ జిత్తమునం జలనంబులేని సు

స్థితియును నిర్వికల్ప రతియుఁ జెందుటయుఁ విమలైక భావముఁ
సతతము నశ్రమంబు సహజ జన్మమునం బ్రసు సమాధిసంయు

తా. విచారమును, నిజానుభవము గలుగుటయు, బహుతత్వ సామ్యము గూర్చుకొనినను, చిత్తస్థైర్యము కలిగి యుండుటయు, నిర్వికల్ప రతియు, నిర్మ ము, ఎప్పుడు శ్రమ లేకుండుటయు, సమాధి యనఁబడును.

* సద్గురు సేవాప్రాముఖ్యనిరూపణము. *

క. సమధిక మతి నీయష్టాం
గములందును నేర్పు చాలఁ గలహఠవిద్యా
ప్రముదితునకు సద్గురు కృప
సమకూరిన రాజయోగ సౌఖ్యము గలుగున్.

తా. హఠ యోగముండినను నీయష్టాంగము లందును నేర్పుగలిగించు రాజ ము లభించుటకు గురుకృప యే ప్రధానము.

క. సుజనులగు వారు సద్గురు
భజనం బొనరించి రేని ప్రాప్తించును న
క్కజమైన రాజయోగము
నజహరి సురలైనఁ బొంద రన్యక్రియలన్.

తా. ఏసుజనుఁడు సద్గురుని సేవించునో, యతనికే యీ రాజ యోగము గాని బ్రహ్మ విష్ణ్వాదులైనను మరొక విధమున దీనిని బొందనేరు.

తే. గీ. దుష్కరాభ్యాస యోగంబు లోడమిగుల
నెపుడు నాయాస పడఁగ నంతే దేమిఫలము
లోకమున సద్గురు కృపావలోకనమున
బ్రహ్మవిద్య తత్క్షణంబు లోపలనె కలుగు.

తా. దుష్కరాభ్యాసముగల యోగములతో శ్రమ పడుచుండిన ఫలమేమ ము లేదు. సద్గురుకరుణా కటాక్షమున బ్రహ్మ విద్య తత్క్షణంబులో లభించును.

తే. గీ. అఖిల జంతువు లందు బాహ్యాంతరముల

విశదమై పరబ్రహ్మంబు । వెలుఁగుచుండు
నట్టులైనను దత్పద । మాత్మఁగాన
లేరు,సద్గురు సంసేవ । లేనివారు. ౧౭

తా. సమస్త ప్రాణులందు బాహ్యాంతరముల నిర్మలపర బ్రహ్మము వెలుంగుచుం నను అయినను నాపరమాత్మ నాత్మయందు గురుసేవ లేనివారు చూడఁజాలరు.

తే. గీ. అమితనానా విభేద శా । స్త్రాంధ కార
ముమల తరయోగ శాస్త్రము । హార్క దీప్తి
వలన వణఁచుచు సద్గురు । స్వామిపలుకు
నమ్మి యోగి గావలయు నే । గమ్మబుధుఁడు. ౧౮

తా. అనేక శాస్త్ర భేదములజనించు భేదభావమనునంధ కారమును నిర్మల యోగశాస్త్ర సూర్యప్రకాశమున నశింపఁజేయుచు, గురువుమాటనమ్మి శీఘ్రముగ యోగి గావలయునుమా?

*శాస్త్రజ్ఞ నిరాకరణము*

సీ. మాయాపరదు రభి । ప్రాయముల్ సెప్పెడి
వేదాంత విదుల వి । వేకమొంత
దాన ప్రశంసన । దగులు వైశేషిక
భాష్య పాఠకులమై । దుష్యమొంత
మఱికర్త లేదు క । ర్మమె కర్తయనియెడు
భాట్టపండితుల యా । ప్రతిభయెంత
యప్రమాణాది ప । దార్థ చింతకులగు
నైయా యికులు నిపు । ణత్వమెంత

తే. గీ. యన్యసిద్ధాంతి కులును భే । దాభిరతులుఁ
గానయన్యోన్య తర్కక । ర్కశులు శాస్త్ర
లాదిఱుదు ఘటపటము । ఖ, న్యాయవాద
ములనెకాలముఁ, బుత్తురు, మోసపోయి.

తా. వేదాంతు లంతయు మాయమనియాచరణములేనికుపర్క వేదాంతములబోధిం

చున్ కాలము గడపుదురు దాంప్రశంసనే చేయుచు వైశేషిక భావ్యపారగుల కే
లబు ప్రమ్మనుచు పేరేంద్ర లేదనియు- కర్మమేకర్త యనియు భాట్టమతస్థులు
పుత్తురు. అప్రమాణమును పదార్థ చింతనచే నైయాయికులు కాలము వెళ్లించుదురు
లును భేదవాద ప్రధానులై కాలము గడుపుదురు. తర్కశాస్త్రాది శాస్త్రముల
కొనిన శాస్త్రజ్ఞులందఱు నటుపట న్యాయశుష్కవాదమున కాలముగడుపు చుందురు
యాదిశాస్త్రమోజనమని భావింపరు.

క. గురుముఖమున సూక్ష్మబ
హ్మరహస్యం బెఱుంగఁడేని, నాతని శాస్త్రో
త్కరము సమానంబగుని
ర్ధనధుని చేతనున్న, దర్పణమునకున్.

తా. ఎవఁడు గురువువలన సూక్ష్మమగు బ్రహ్మవిద్యారహస్యము
తెలిసికొని తెలుఁగఁడో, అతనికిఁ దాను చదివికొనిన శాస్త్రమంతయు గ్రుడ్డివానిచేతి అద్దము
వలె నిరర్థకమని భావింపవలయును.

క. అవిరళము వేదములు శా
స్త్రవివాదములును గలిచి, తత్త్వజ్ఞుఁడుగాఁ
డవివేక మేర్పడ జనుఁడి
డివిచిత్ర మెపాకరసము, తెడ్డేమెఱుఁగున్.

తా. గరిటె, పాకము రుచినెఱిగి లేనట్లుల మూర్ఖుఁడవివేకియై వేదశా
స్త్రములు చదివినను తత్త్వమును గుర్తింప నేరఁడు.

—* గురువు లేనివారు చెడిపోదు రనుట. *—

క. సమయగ్రస్తులు చతురా
శ్రమములును శ్రుతిశాస్త్ర బహుపు, రాణాఖ్యానా
గమ నిరతులు మార్గ్గ
భ్రమఁజెందుదురు గురుఁడు లేని, పాపముకతనన్.

తా. అనేక వేదాగమ పురాణాది శాస్త్రములఁ జదివియు నాలుగాశ్ర
వారును గురువు లేనిచోఁ జెడిపోవుదురు.

క. సరస కవితా విరచనా
స్ఫురణం గలవారు సభలఁ, బొంగుచు వాగ్వై
ఖరిని ఆపు వారలు నహం
కరింపుదురు సద్గురుండు, గలుగమిఁ గుమతుల్. ౨౩

తా. సరస కవిత్వము చెప్పెడి కవీశ్వరులును- సభలందు నుపన్యసించు సభాసౌష్ఠ
వులును సద్గురువులేక పోవుట చేతనే యహంకార మగ్నులగుచుందురు.

తే. గీ. మూర్ఖజనుల ఖండజ్ఞాన, మునఁ జరించు
వారు రసరసాయన ధాతు, వాద పగులుఁ
గామ్యవతి మాత్రలయ వాతాకలితులైన
వారలును సద్గురుఁడు లేని, వారె కారె. ౨౪

తా. మూర్ఖులును- ధాతు వాదము చేయువారును- ఫలాపేక్షచే మంత్ర లయ
యోగపరులును- అఖండ జ్ఞానము గలవారును- గురువులేని వారైయహంకారమునఁ
జెడిపోవుదురు.

—* శాస్త్రాధ్యయనాది నిరాకరణము. *—

మ. ధనధాన్యంబులు క్షేత్రముల్ గృహములు ద్వర్గోధనంబుల్ వరేం
దిరను త్తైశ్వర్యము లాత్మమిత్రసుకళత్ర భ్రాతృ సద్బాంధవం
దనము ఖ్యల్ శ్రుతి శాస్త్ర భారతిపురాణ స్తోత్రముల్ పేర్మి సం
జనునీ యున్న యుమోగి పఘ్న కరసం సారంబ యూహింపఁ గన్.

తా. ధనముగాని, ధాన్యముగాని, గృహములుగాని, గోవులుగాని, కళత్రపుత్రమిత్రా
దులుగాని, వేదశాస్త్ర పురాణ స్తోత్రాదులుగాని, యన్నియు మోగమునకు విఘ్నకరంబులు.

క. ఇట్టివివిధ సంస్కృతియును
దట్టపుచీకట్టి మునింగి తద్భ్రమణమునన్
బొట్టుపొరల వెడి మనుజుం
డెట్టుగనంగలఁడు గురుని సేశ్వరమూర్తిన్. ౨౬

తా. ఈవిధముగ సంసారమనెడి యంధకారమునఁ బడి తెరవుగానక తిరుగు మ
నుజుండు ఈశ్వర రూపుఁడగు గురువు నెట్లు గాంచ గలఁడు.

క. అపరోక్షాత్మ కమగుచున
నుపమిత సుఖమైన రాజ। యోగజ్ఞానం
బపరిమిత భక్తి సద్గురు
కృపవడయుట లేనివారి। కిల లేదెందుఁ.

తా. కరతలామలకము వోలెఁ బ్రకాశించుచు నిరుపమానమైన సుఖంబు సంగు రాజయోగజ్ఞానము- మిక్కిలి భక్తి గలిగి గురుకృపాపాత్రులైన వారికే గలు

ఆ. వె. చిదుగు లేకుఁగాన। చిచ్చు గాయగ లేని
యట్లశాస్త్రములకు। నాయువెల్లఁ
బోవుఁగాన బ్రహ్మ। భావంబు సంక్షిప్త
శాస్త్రములను దెలియఁ। జతురయమున.

తా. చిదుగుపుడకలనేతిపఁటుకేవలటుకునిచ్ఛయుంచు గాని, యాయగ్ని పాలి గాచుకొనుటకు సమర్థుడు కాని విధమున, బలువిధములగు శాస్త్రములఁ జదువుటకే కాల యువిని యోగపరచుదురు గాని, సంక్షిప్త శాస్త్రముల బ్రహ్మము దెలియుటకు ప్ర యత్నించరు గదా!

చ. బహువిధశాస్త్ర భారముల, సారములన్నియుఁ జూచి సారసం
గ్రహమొనరింప, దత్కృతికిఁ, గాలము చాలదు విఘ్న భూతమ
మహిఁ బహుళంబు లౌటఁ, మఱి, మంతులు చేసిన సూక్ష్మశాస్త్ర
గ్రహణము మేలు హంసము దఁ, కస్థితదుగ్ధ ముఁగ్రోలు చాడ్పు

తా. శాస్త్రము లనేకము లున్నవి. అవియన్నియుఁ జూచి వాని సారముల హాముగా గూర్చుటకు వ్యవధి చాలదు. ఇందుకు కారణము సత్కార్యములకు విఘ్న రంపరం వచ్చుటయే కావున నిదివరలో బుద్ధిమంతులు- సంపాదించిన సూక్ష్మ శాస్త్ర సంగ్రహించి హంసము నీరమును వదిలి క్షీరమును గైకొను చందమున శాస్త్రము లన్ని వదలి బుద్ధిమంతులు చేసిన సూక్ష్మ శాస్త్ర సాముర నేగ్రహించ వలయును.

—*శివ యోగాభ్యాసావశ్యకత్వము *—

తరువోజ

పది వేలు చదువులు, పఠింపనేల

పరమ సంయమిజన, ప్రకరసేవ్యంబు
సదమల వేదాంత, సారమహార
సకలసంసిద్ధాంత, సామరస్యంబు
విదితంబు శివయోగ, విధియయీయోగ
విరహితుండెన్నండు విధి, వసుండగుండ.
యిదిగల్గినను వారి, కెపుడుగుంగర్మ
మెల్లమోక్షానంద, మెప్పుడుం గలుగు. ౩౦

తా. పదివేల చదువులు చదువుట యెందుకు? సర్వవేదాంత సారము. సకల సి
ద్ధాంత సమ్మతమునై సంసారము దూరముగాఁ జేయు శివయోగ విధిని దెలిసికొన వలయును.
ఈశివయోగము నెఱుంగని వాఁడు కర్మాధీనుఁడగును. దీని నెఱింగిన వారికిఁ గర్మ
తొలఁగి పోవును. మోక్షానంద మెల్లకాలమును గలుగును.

క. భానములర సద్గురు పద
సేవారతిఁ జేసి యిట్టి • శివయోగము సం
భావితమగు సుజనులకుం
గావున సద్గురుని వెదకఁ • గాఁదగు ధరణిన్. ౩౧

తా. ఎవరు మహాభక్తి యుక్తులై సద్గురుపదసేవఁ జేయుదురో, వారికిఁ గానియీ
శివయోగ జ్ఞానము కలుగ నేరదు. కాఁబట్టి సుజనులు సద్గురుని వెదకి కనుగొన వలయును

—* తత్వబోధక గురుప్రాధాన్య నిర్ణయము. *—

క. సమయాచారము లుపదే
శము సేయఁగ గురువులిలన • సంఖ్యాతులు ని
క్కముదాఁ గన్నమయాచా
రము గురుఁడుగలుగుట. రిపయ • రయనొకఁ డైనన్. ౩౨

తా. సమయాచారము లుపదేశించు గురువులు వేనవేలు గలరు. నిజమైన సుము
ఖ సమయాచారము నుపదేశింప గలగురువు దొరకుట దుర్లభము.

చ. చెఱకునఁ బండు చందనపు • చెట్టునఁ బువ్వము కాంచనంబునం
దఱుఁగని లావిగల్గిపవి • ధంబున నాగమ వేది శైవుఁడై

వఱలు మహాత్ముఁడైన । గురువర్యుని యందును బ్రహ్మవిద్యయు
మెఱయుచు నుండె నేనియది । మేలతఁడబ్బుట భాగ్యమెంతయు

తా. ఆగమశాస్త్ర వేదియు- శైవుఁడునునగు మహాత్మునకు బ్రహ్మవిద్య సంభవి
చినచో నాతఁడు చెఱకునకుఁ బండును- మంచిగంధము చెట్టునకుఁ బుష్పమును, బం
గారమునకుఁ బరిమళమును నబ్బినవిధంబునఁ బ్రకాశించును.

వ. కావున.

తా. కాఁబట్టి.

క్ర. ఆసమయాద్యాచార్యుఁడు
తా సుజ్ఞానోపదేశ । దక్షత గలవాఁ
డై సేవ్యుండగు నట్టుగా
దే సద్గురుఁ జేరవలయు । నితరుని రాఁజొల్.

తా. శివగురువు జ్ఞానోపదేశ మొనర్ప సమర్థుఁడైనచో, నాతఁడు సేవింప
న వాడు. లేనిచో జ్ఞానోపదేశముకొఱకై యితరుని గురువు గాస్వీకరింప వచ్చును. గా
న సంప్రదాయ గురువుని విడుచుట న్యాయము గాదు.

క. భ్రమరము నిర్గంధ ప్రసవముఁ దొలఁగుచు మఱియుఁగమ్మ । పలచు పువ్వులకుఁ
గ్రమమున నరుగు పగిది సు
త్తమ గుర్వంతరము చేయఁ । దగు శిష్యులకున్.

తా. తుమ్మెద మకరందమునకై పరిమళములేని పూవులవదిలి సుగంధ కుసుమ
ములకేగు విధమున సుజ్ఞానోపదేశము నొందుటకై యితర గురువుల నాశ్రయించినను
దోషములేదు. గానితన గురువును విడుచుట మహాపాతకము.

తే. గీ. అట్టి గురుమూర్తి శివయోగ । మనెడి బీజ
మును సద్భక్తిగల శిష్యుఁ । డనెడు మంచి
భూమి నిలుపంగఁ గడు శీఘ్ర । మున నెలర్చి
ప్రకటముగ నిచ్చును భయతా । రక ఫలమ్ము.

తా. గురువు- శివయోగ మనెడిబీజమునుసద్భక్తి గల శిష్యుఁడను భూమి
యందు నాటినశీఘ్రముగానది మొలకెత్తి పెరిగి వృక్షముగా వర్ధిల్లి సంసారభయమును తొలగించి మోక్షఫలమును నొసంగును

## —✱ ఆచార్యమహిమ. ✱—

కస్తూరి కాదుల । గంధంబు నవనీరు
వాహుల సుచ్ఛాయయు, నగ్నియందు
దాహకత్వము నిక్షు । దండంబులను మధు
రంబు హిమమున శీ, తంబు తిలలఁ
దైలంబు కాష్ఠ సం । తతిలోన శిఖియుర
త్నములలో మించును, ధరణియందుఁ
బ్రికట ప్రకాశంబు । పాలలో ఘృతము స్వ
భావంబులై యున్న । యావిధమున

తే. గీ. నెఱయ సఖిలంబు నందును । నిలిచియున్న
తత్త్వమిదియని చూపి దు । స్తర భవాంబు
రాశిఁ దాఁటింప సద్గురు । ప్రభుఁ డొకండు
తక్కనితరుల కొందును । దరమె తలఁప. ౩౮

తా. కస్తూరి యందు పరిమళమును- వృక్షము లందు నీడయు- నగ్ని యందు దాహకి యు- చెఱుకు నందు మధురంబును- మంచుయందు శైత్యంబును నువ్వుల యం దు నెయ్యి- కట్టెయందగ్నియు, రత్నము లందు మెఱుపును, పాలయందు ఘృతంబు స్వభావముగా నుండిన విధమున, సర్వవస్తువులయందునిండియున్న తత్వ మిదియనిచూపి సంసార సాగరమునుండి తరియింపఁ గలప్రభువు సద్గురుఁడుతప్పఁ నితరుఁడొకండు కాదుసుమీ.

వ. అదియుంగాక పృథివ్యాది పంచ భూతంబులును గంధాది తద్గుణ పంచకంబును, శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకంబును, వాగాది కర్మేంద్రియ పంచకంబును, మనోబుద్ధి చిత్తాహంకారంబులనునంతః కరణ చతుష్టయంబులంగూడ నిరువది నాలుగు తత్వంబులం గలిగి, ప్రకృతియని, ప్రధానమని, కారణమని చెప్పందగి యనాదిదై యున్న మాయా స్వరూపంబ భిన్నభావంబున సకలలోకంబులు నధిగమించి గోరుపడంబు ముసుగు పడ్డ చందంబున నుండును. అది గారణంబుగా సకల భూతంబులు నజ్ఞాన స్వరూపులై

న మాయాంధకారంబున మగ్నతం బొంది యుండు నట్టి
లోన సర్వపాపక్షయంబైన జీవులకుం బరమేశ్వరానుగ్రహ
న సద్గురుండు లభ్యుండై తత్త్వాంజనంబు కన్నులం జిలికించి
ల నందఱం దెలివిఁ బొందించి తిరోధాయక మాయా పటలంబు విటతాట
గాఁ జేసి, పరతత్త్వంబుఁ జూపెట్టిదని దృష్టప్రత్యయంబుగా నిరూపించి
వస్నహా నిధానంబు కరతలామలకంబుగ దయచేసి యెడ యుం
శోకమోహ జరామరణ స్వర్గనరక పునర్భవాది దుఃఖంబు
రు వెట్టించి సకలక్లేశ విముక్తులం జేసి నిత్యానందంబు బొంది
నట్లు గావున.

తా. పృథివ్యప్తేజో వాయు గాకాశములను బంచభూతములైదు శబ్దస్పర్శ
రసగంధములైదు, త్వక్చక్షు శ్రోత్ర జిహ్వ ఘ్రాణములైదు, వాక్పాణి పాదపాయు తే
లైదు, మనోబుద్ధి చిత్తాహంకారములు నాలుగు కలసి మొత్తము ౨౪ తత్త్వము
క్కృతి యనఁబడును. ఈప్రకృతికే ప్రధానమని కారణమని రెండు పేరులు గలవు.
య నాదిమాయాస్వరూపంబుతోఁ గూడికొని ప్రపంచము నాక్రమించి కంబళిముసుఁగిడి
ట్లు చేత సకల భూతంబులు నజ్ఞానాంధకారంబునఁ బడియుండును. ఎప్పుడు జీవులకుఁ
క్షీణించునో, అపుడే పరమేశ్వరానుగ్రహమున సద్గురువు దొరకును. అతఁడు తన
యంధత్వమును బోగొట్టుటకై తత్త్వాంజనము వేసి మాయా సమూహమును శింపఁజేసి
లామలకంబుగఁ బరతత్త్వంబు జూపించి జనన మరణాదిదుఃఖముల దూరముగాఁ జే
ఈరీతిగ విరాజిల్లువాఁడే యాచార్యుఁడనఁ బడును.

తే. గీ. సేమ మలరంగ సద్గురు । స్వామిఁ జేర
నతఁడు తత్త్వంబు నెఱిఁగించు । నంతలోన
భానుఁ డుదయింపఁ జీకటి । పాయుకరణిఁ
దాన నెడఁబాయు మాయ స । న్మానవులకు.

తా. ఎప్పుడు సద్గురువు తత్త్వంబుపదేశించునో, అపుడే సూర్యోదయమున
ంధకారము పోవునట్టుల మానవులకు మాయ నశించును.

క. స్థిరమాహాత్మ్య గ్రవనాం
తర భూములఁ గ్రుమ్మరుచుఁ బ, థముగా ననియా

పురుషుఁడు సద్గురుఁడను చో
ప్పరి నడుగక యున్నవాఁడు పడఁడే భ్రాంతిన్. ౪౧

తా. మాయామానెక్కి మహారణ్యంబునఁ జరించువారలు సద్గురువనెవ్వని యాట ఏకుని
గము లడుగకున్న భ్రాంతిలోఁ బడిపోవరా?

క. జనుఁడి ట్టిదె కావునన్
మ్నవమున సద్గురుల వాక్య । మాణము సర్వం
బును నమ్మి రాజయోగం
బు నెఱుఁగ న్వలయుఁ ముక్తిఁ । బొందవలసినన్. ౪౨

తా. కావున ముక్తిఁ బొందఁ దలఁచిన మానవులు సద్గురు వాక్యంబుల నమ్మి రాజయో
దెలిసికొన వలయును

తే. గీ. తను నెఱుఁగు నెవ్వఁడాద్యన । ద్వయు నజడుని
రంజనుని నిత్య తృప్తున । నంతు నచలు
నమిత చిన్మయానందన । రామృత స్వ
రూపుగా స్వభావమునగు । రుండతండు. ౪౩

తా. ఏకంబును, నిరంజనుఁడును, నిత్యస్వరూపుఁడునగు పరశివ స్వరూపము తత్వ
దెలియునో, ఆతఁడు నిజముగా "గురువు" అనిచెప్పఁ దగినవాఁడు.

వ. ఈయర్థంబున కొక్క యితిహాసంబు సూతసంహిత యందు ము
క్తి ఖండంబున నఖండ జ్ఞాన కారణంబై యొప్పుచుండును. అది
యెట్టిదనిన. నానావిధ శివకథా వ్యాఖ్యాన విఖ్యాతుండైన సూ
తుండు మునీంద్రుల కిట్లనియె. ౪౪

తా. ఈవిషయమునకైయొక యితిహాసము సూతసంహిత యందలి ముక్తి ఖండంబు,
అదియఖండ జ్ఞానమునకుఁ గారణమగును. ఆనిసూతుఁడాకథను శౌనకాదిమహర్షుల
కిట్టుల జెప్పె.

సూతుండు శౌనకాది మహర్షులతో నాచార్యనిర్ణయమును వచించుట*

ఉ. అంబుదవాంబు లన్మనుస । హస్రములన్ శివుఁ బూజసేయుచో
నంబుజ మందులో నొకటి । యారయఁ దక్కువ యైననాత్మ నే

త్రాంబుసహాంబు పుష్పతగ ♦ నర్చనచేసిన నీరశైవర-
త్నంబగు విష్ణుదేవుసియు ♦ దంచిత భక్తికి సూల్ప్రీతుఁడై.

తా. ప్రతిదినము సహస్రకమలములచే శివుని విష్ణువు పూజించు చుండగ, విర బున నతనికి వేయి కమలములలో నొక కమలంబు దక్కువ కాగా నాతఁడు తన కమలము దీసి శివుని బూజించెను. అంతశివుఁడు సంతసించి యాతనితో నిట్లనెను.

క. మెచ్చి నయనాబ్జ మాతని
కిచ్చి శివుఁడు మఱియు నతని ♦ యిష్టమెఱిఁగితా
నిచ్చెం జక్రము విష్ణుం
డచ్చపు శివభక్తిమైమ ♦ హాత్మ్యుండయ్యెన్.

తా. విష్ణుమూర్తీ! నీతపంబునకు మెచ్చితిని. నీమనోరథము నాకుఁ దెలిసి కొనుమని శంఖచక్రము లిచ్చెను. శివపూజచేతనే విష్ణుమూర్తి మహాత్ముఁడయ్యె.

క. అవిష్ణునిచేఁ బ్రార్థితుఁ
డై విశ్వేశ్వరుఁడు మాహేశుఁ ♦ డవ్యయుఁ డతనిం
బావన తత్త్వజ్ఞాన
శ్రీవిలసితుఁ జేయఁదలఁచి ♦ చిరతర కరుణన్.

తా. బకప్పుడీశ్వరుఁడు కరుణామయుఁడై తన భక్తుఁడగు విష్ణుమూర్తిని నిర్మలఁజేయఁదలంచెను.

తే. గీ. డానవారికి నిట్లని ♦ యానతిచ్చె
నీకునేమోచక ప్రదుఁ ♦ ప్రాకటముగ
నెఱిఁగఁ జెప్పెదఁ దద్విధ ♦ మెల్ల వినుము
నీరరుహనేత్ర యెంతయు ♦ నిష్ఠతోడ.

తా. అప్పుడా శంకరుఁడు "విష్ణుమూర్తీ! నేనునీకు మోక్షముసంగు వాక్షితోను విధముచెప్పెద. నాలకింపుము" అని యిట్లుచెప్పఁ దొడఁగెను.

క. ఆచార్యుఁడు సంసార వి
మోచక దాయకుఁడు లోక ♦ మునఁగడుఁ బూజ్యా
డాచార్యుఁడ నగఁ వేదా
ద్యాచరిత విచార చిన్మ ♦ యాత్ముఁడు గృష్ణా.

తా. సంసార సంకటములఁ బారదోలఁ గలుగు మహిమశాలి యగు నాచార్యు లోక పూజ్యుండు. ఓకృష్ణా! వేదాంతవిచార మనమగ్నుఁడై చిన్మయ స్వరూపుఁ విరాజిల్లు వాఁడే యాచార్యుఁడగును

## గురుభేద నిరూపణము.

క. క్రమమున నాగని వనేకవి
ధముల నెఱుఁగు మధిక భక్తి దామోదర! యు
త్తముఁడన నుతి మధ్యముఁడు న
ధముఁడనఁదగుఁ జుమీ యతఁడు ధరలోనక్. ౫౧

తా. ఓదామోదరా! ఆతఁడు, ఉత్తముఁడు మధ్యముఁడు, అధముఁడు, అనిమూఁ విధముల నుండునని తెలిసి కొనుము.

సీ. ఉత్తముఁడని చెప్ప నొప్పు బ్రాహ్మణుఁడు మ
ధ్యముఁడు క్షత్రియుఁడగు నధముఁడయ్యె
వైశ్యుఁడయ్య ధముఁడు వైశ్యునకును శూద్రు
నకు గురుండగుఁ బద్మనాభ మధ్య
ముఁడు గురుఁడగు మధ్యమునకు వైశ్యునకును
శుశ్రూషుఁడైనట్టి శూద్రునకును
మహిమ నుత్తముఁడు బ్రాహ్మణునకుఁ క్షత్రియు
నకు వైశ్యునకు శూద్రునకు గురుండు

తే. గీ. వనితలకు శూద్రులకు గురుత్వము దలంపఁ
గలుగ దెన్నఁడు సుజ్ఞాన బలముకలన
వైశ్యునకు రాజు నకుగురుత్వంబుగొంద
అనుమతింతురు తమకంటె నార్యులనుచు. ౫౨

తా. ఆచార్యుఁడు బ్రాహ్మణుఁడైనచో నుత్తముఁడనఁబడును క్షత్రియుఁడైనచో మధ్యముఁడును వైశ్యుఁడయినచో నధముఁడునని వచింపఁ బడును. వైశ్యుఁడు వైశ్యునకును శూద్రునకును గురువు కావచ్చును. క్షత్రియుఁడు క్షత్రియ వైశ్య శూద్రులకు మువ్వురికి గురువుగా నుండఁదగును. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు నలువు

కి గురువుగా నుండవచ్చును. స్త్రీశూద్రులకు గురుత్వముచేయ నధికారమే లేదు. బలమున దక్షులంటే గొప్పవారనితలంచి రాజులకు వైశ్యులకు కొందరు గురువు గీక రింతురు.

సీ. అయిదు విధంబుల ♦ నయ్యుత్త మగురుండు
బ్రహ్మవేత్తలచేతఁ ♦ బ్రస్తుతాత్ముఁ
డగు బ్రహ్మచారి గృ ♦ హస్థ వాన ప్రస్థుఁ
డును నట భిక్షుకుం ♦ డును ముదంబొ
లయ నతి వర్ణాశ్ర ♦ మియును నను వారు నెం
డొరుకంటె శ్రేష్ఠులు ♦ వరుసతోడ
నాశ్రేష్ఠులకు శ్రేష్ఠు ♦ లందఱు గురువులు
వేయును నేటికి ♦ తోయజాక్ష.

తే. గీ. బ్రహ్మచారి విద్యోత్కర్ష ♦ బలముకలిమి
నాగృహస్థ వానప్రస్థ ♦ యతుల కగును
గురుఁడునట్ల విద్యాబల ♦ స్ఫురితుఁడగు వ
నస్థుఁడును గురుఁడు నగును స ♦ న్న్యాసి కరయ.

తా. ఆగురువు - బ్రహ్మ చారియు, గృహస్థుఁడు, వానప్రస్థుఁడు - భిక్షు అతివర్ణాశ్రమి - యనియైదు విధములుగా నుండును. వీంలోనొకరి కంటె నొకరు శ్రే గురువు లెల్లను శ్రేష్ఠులలో శ్రేష్ఠులఁసుమా! విద్యాతిశ యమున బ్రహ్మ చారి గృహ న ప్రస్థయతులకు గురువగును. విద్యా బలముగల వనస్థుఁడును సన్న్యాసికి గురువు కావ

అతివర్ణాశ్రమి నిరూపణము.

క. కమలాధీశ వినుము లో
లమహిమ సర్వాధికారు ♦ లకు నతి వర్ణా
శ్రమి గురుఁడగు శిష్యుఁడుగాఁ
డమలోత్తము యేను బోలె ♦ నతఁడెవ్వరికిన్.

తా. ఓలక్ష్మీపతీ! వినుము నేనెటుల నందటికి గురువునో, అటులేయతి శ్రమి సర్వాధి కారులకు గురువగును. శిష్యుఁడు కాఁడేరఁడు.

క. అతివర్ణాశ్రమి యగు వి
శ్రుతి చరితుఁడు గురువులకు గు • రుఁడు లోకమునం
దలనికి సమఁడధికుఁడు నగు
నతఁడును లేఁడొండు సంశ • యములేదు హరీ. ౧౪

తా. అతివర్ణాశ్రమి ప్రపంచంబునందు సుప్రసిద్ధుఁడగు మహాత్ముఁడు. ఆతఁడు గురువులకు గురువు. లోకంబువనాతనికి సమానుఁడు గాని, యధికుఁడు గాని, యెవ్వఁడును లేఁడు.

సీ. దేహేంద్రియాదుల • కూహింప భిన్నమై
పరమార్థ విజ్ఞాన • భావమై య
నంత సుఖాస్పద • మై తనంతన ప్రభు
వై సర్వసాక్షియై • యాద్య మగుచు
నరిగినవస్థాత్రయ,నిర్ముక్తమై సహ
జావస్థఁ దానయై • యచ్యుతంబు
నై యున్న పరతత్త్వ • మగు మహాదేవుని
నెవ్వఁ డెల్లపుడును • నెఱుఁగు చుండు

తే. గీ. సంతసం బొదవంగ వే • దాంత శాస్త్ర
గతి మహావాక్యముల విస్కి • కలిమిఁ జేసి
యెవ్వఁడాత్మ నీశ్వరునిగా • నెఱుఁగుఁ దన్ను
మహినతఁడతి వర్ణాశ్ర • మంబు వాఁడు. ౧౫

తా. విచారింపఁగా దేహమునకు నింద్రియాదులకును వేఱై జ్ఞాన స్వరూపుఁడై పరిపూర్ణుఁడై సర్వసాక్షియై యవస్థాత్రియ విలక్షణుఁడై నాశరహితుఁడై వెలుఁగు, నామహాదేవుని వేదాంతశాస్త్ర మార్గ మునను మహావాక్యముల వినుటవల్లను నెవ్వఁ డెఱుఁగునో, ఎవ్వఁడు తన్నుతనయాత్మను నీశ్వరుని గా భావించునో, యతండతివర్ణాశ్రమి యనఁబడు.

మ. అతి వర్ణంబులు నాశ్రమాదులు శరీ • రం బందు మాయా ప్రక
ల్పితముల్ కేవల బోధరూపినగుటన్ • లేవెవ్వియున్నాకును
న్మతినిక్కంబుగఁ బుట్టునెవ్వనికి నా • మ్నాయాంత పాఠంబుచే
నతివర్ణాశ్రమియానతండిటులుమా • యాధ్వాంతముం బాయుచున్

తా. బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములు బ్రహ్మచారి గృహస్థాద్యాశ్రమములును

శరీరములను మాయచేఁ గల్పితములు. జ్ఞానరూపుఁడగు నాకెవ్వియు లేవు. నేనా గు నుపాధివస్తువులఁ బఱించుటచేత నెవనికి సమ్మతిగలుగునో వాఁడు మాయాంధ కారపంకశరణుఁడు నతివర్ణాశ్రమియయి పేర్కొనఁబడును.

మ. శతపత్రాప్తుని సన్నిధానమునన। భ్రాంతంబుచక్షుల్ ప్రచే
ష్టితమైనట్లు మదీయ సన్నిధిన తాఁ। జేష్టించు చుండున్ గ
ద్వితతుల్ సర్వమునంచు నెవ్వఁడెఱుగున్। వేదాంతశాస్త్రం
దతివర్ణాశ్రమియౌనతండిటులుమా। యాధ్వాంతముం బాయు

తా. సూర్యుని సమీపమునందు నేత్రములెటుల (జూచుటకు) చంచలతనొం
అటులే యీజగమంతయు నామందు మాయచేఁ గల్పింపఁబడి యున్నదని యెవ్వఁ
గునో వాఁడే మాయాంధకారమును బోఁగొలిన యత్యాశ్రమి సుమా?

మ. అతిమాయాస్థితి శుక్తియందు రజతంబై భారోపితంబైన య
ట్లతలంపన్ మహదాదియైన జగమెల్లన్ మాయనాయందు క
ల్పితమైయున్నదియంచు నెవ్వఁడెఱుగున్। వేదాంతశాస్త్రంబు
దతివర్ణాశ్రమియౌనతఁడిటులుమాకయాధ్వాంతముం బాయు

తా. మాయా ప్రభావమున ముత్యము చిప్పయందు వెండియను భ్రాంతిగలి
మహదాదియైన జగమంతయు మాయచే నాయందుఁ గల్పితమై యున్నదని యెవ్వఁ
గునో వాఁడే మాయవశింపఁజేసిన యత్యాశ్రమి సుమా?

సీ. చండాలతనువున। నొండెతిర్యగ్జంతు
తనువులందును బ్రహ్మ। తనువులందు
మఱియును దారత। మ్యమున నన్యములందుఁ
బురుషోత్తమన! ఛంబుఁ। బోలెసర్వ
థావ్యాప్తుఁడై విశు। ద్ధ స్వరూపుఁడు సర్వ
బంధవర్జితుఁడునై। పరమపరుఁడు
నేకమూర్తియును మ। హేశ్వరుఁడును శ్రీమ
హాదేవుఁడును బర। మామృతంబు
తే. గీ. నైనయాపర శివుఁడనే। నను చు నెవ్వఁ
డాత్మ నెఱుగంగ నేర్చు వే। దాంతశాస్త్ర

సరణిఁ జలిత భేదవి । జ్ఞాని యగుచు
మహిఁ జెలఁగుచుండు నతఁడతివర్ణాశ్ర । మంబు వాఁడు. ౫౯

తా. ఓకృష్ణా! చండాల శరీరమందుఁ గాని, తిర్యగ్జంతువులగు పశుపక్ష్యాది శరీరములందుఁ గాని, బ్రహ్మశరీరమందుఁ గాని, తారతమ్యములేక యాకాశంబుపగిది వ్యాపించిన శుద్ధ స్వరూపుఁడయి బంధరహితుఁడయి యేకమూర్తియయి యున్న యాపరశివుఁడు-ఆ మహాదేవుఁడు- నేనే యని నిశ్చల భేదజ్ఞానమున వేదాంతమార్గము ననుసరించి యెవఁడు గుఱుతెఱుంగునో, అతఁడే యత్యాశ్రమి వాఁడగు.

సీ. దృష్టదిగ్భ్రమఁ బొందినట్టి । నరునకుఁ జూడంగఁ
దొంటి యట్లనుదిక్కు-। దోఁచునట్లు
సకలజగంబు వి । జ్ఞాన విధ్వంసమై
మదినాకుఁ దోఁచుఁద । న్మయమయగుచు
స్వప్న ప్రపంచంబు । చర్చింపఁగా మాయ
చేనతి జృంభిత । మైనయట్లు
బహువిధ జాగ్రత్ప్ర । పంచమింతయునుమా
యావిజృంభితము నా । యందు నెపుడు

తే. గీ. ననుచు వేదాంతముల నెవ్వఁ । డాత్మనెఱుఁగు
బ్రహ్మవిద్యా సుఖస్వాను । భవమువలన
నధిక సంతుష్ట హృదయుఁడై । యలరుచుండు
మహిని తండతి వర్ణాశ్ర । మంబు వాఁడు. ౬౦

తా. దిగ్భ్రాంతి నశించినవానికిఁ బూర్వమువలె దిక్కులు గన్పించు ననియు, విజ్ఞానమున నశించినదై సకలజగంబును బరమేశ్వర స్వరూపమై ప్రకాశించు ననియు- మాయవలన స్వప్న సదృశమగు నీప్రపంచ మంతయు విజృంభింపఁ జేయఁబడిన దనియును, ననేకవిధములుగా నున్న యీప్రపంచమంతయు నాయందే మాయచే నభివృద్ధి చెందె ననియు, వేదాంతశాస్త్ర పరిజ్ఞానమున దెలిసికొని యెవఁడు బ్రహ్మవిద్యా సుఖానుభవము గలవాఁడై సంతుష్టహృదయుఁడయి విరాజిల్లుచుండునో, వాఁడే యత్యాశ్రమి యని వచింపబడును.

వ. ఆత్మావలోకనంబు వలన నెవ్వనికి వర్ణాశ్రమాచార భేదంబులు గళితంబులగు నతండు సర్వవర్ణాశ్రమంబులు నతిక్రమించి యాత్మ

యందు సుస్థితుండై సతివర్ణాశ్రమియని వేదాంతార్థ వేత్త
జెప్పంబడు. మఱియు దేహేంద్రియ ప్రాణమనోబుద్ధి చిత్తా
కారం మాయలను వ్యోమాది జగజ్జాలంబును గర్తయు,
యు, భోజియు నింతియుం గానుచు యథార్థంబునం గే
న చిత్సదానంద బ్రహ్మంబే నేనని యెఱుంగు నెవ్వండతి
శ్రమి యనందగు నదియునుం గాక.

తా. పరమాత్మను సదా మామటచేత వర్ణాశ్రమాచార భేదంబులులేక సర్వ
ము నెవ్వండాత్మయందు భావించునో, అతండాత్మయందు స్థిరత్వముగల యత్యా
నంబడును.

ఎవండీ దేహముగాని, ఇంద్రియములుగాని, ప్రాణము గాని, మనోబుద్ధి చిత్త
కారములుగాని, మాయగాని, ఆకాశము మొదలగు ప్రపంచంబుగాని, కర్త గాని, భో
ని, భోజయిత గాని, మఱియు నితరంబేదియు నే గాననియు చిదానందమే నేనను
ండుంగునో వాండే యతివర్ణాశ్రమి యనంబడు.

సీ. జలచల నంబునం । జంచలత్వము జల
ప్రతిబింబి జలజాతి । బాంధవునకుం
గలిగినయట్లు హం । కార సంఘాత వ
శమున నాత్మునకు సం । సారమయ్యె
నటుగాన భ్రాంతి స । న్యములైన వర్ణాశ్ర
మంబులాత్మారోపి । తంబులాత్మ
వేదుల కవి లేవు । విధని షేధములు వ
ర్జ్యము నవర్జ్యమును వా । రలకు లేవు
తే. గీ. మఱియు నితర మెద్దియు నాత్మ । నెఱుంగువారి
కేలకిలుంగ నేర్చు నా । హింపనిట్టి
యాత్మ విజ్ఞాన సిద్ధమా । యావిమోహి
తాత్మ తెలియంగ లేరన్నండు । నంబుజాక్ష.

తా. నీటిచలనమున నందుం బ్రతిబింబించిన సూర్యునికిని జలనముగలిగినటుల, అహం
కారము ద్వారా ఆత్మునకు సంసారము గలిగినది. కావున భ్రాంతిచేం గన్పించుచున్న

హాచారంబు లాత్మయందారోపితములైనవి. కావునవాత్మకెత్తులకు విధినిషేధములుగా వర్ణాశ్రమజాతులుగాని, మఱియేదియు కలుగ నేరదు ఓ మంబు జాతా, మాయావిమో హితులైన్న వారునాత్మయందుగల జ్ఞానవిత్వము నెఱుంగలేరు.

౬౩. వె. మాంస చక్షులైన । మనుజులు బ్రహ్మవి
జ్ఞాన భరితవిమల । జనులశిష్ఠ
గగన శక్తులెందుఁ । గనుఁగొందురిదాని స్వ
భావ సిద్ధులైన । భవ్యబుధులు. ౬౩

తా. ఓయచ్యుతా, చర్మచక్షువులైన మనుష్యులు బ్రహ్మజ్ఞానముగల మహాత్ముల ని కనుగొననేరరు.

౬౪. బుద్ధిరహిత జనులందుఁ బ్రి
బుద్ధుఁడు సంయమివరుండు ప్రి । బుద్ధుల లోనన్
సిద్ధముగ సుషుప్తుఁడు సం
శుద్ధాత్ముండగు మనీషి । చూవెముకుందా. ౬౪

తా. ఓముకుందా, బుద్ధిలేనివారందరిలో బుద్ధిమంతుఁడు యతీశ్వరుఁడు. ఇట్టిబుద్ధి వారలలోఁ గూడ సుషుప్తావస్థ నొందియున్న పరిశుద్ధాత్ముఁడు బుద్ధిమంతుఁడు.

వ. ఇవ్విధంబున వేదాంత స్వానుభవ నిశ్చితంబును. నిర్ద్వంద్వంబును, నిర్వికారంబును నిరంజనంబును నిత్యంబును శుద్ధంబునునిరాభాసంబును, జన్మాత్మింబును, పరమామృతంబును నైనయాత్మనాత్మచేత నెవ్వం డెఱుంగు నతండతి వర్ణాశ్రమియగునతండు నానోత్తమ గురుండు. ౬౫

తా. ఈవిధముగ వేదాంతానుభవముగల మహాత్ములచే నిర్ణయింపఁబడినట్టియు, ద్వంద్వవికారంబులులేక నిత్యమై పరిశుద్ధమై యమృత స్వరూపమును, జిత్స్వరూపము న నాత్మను దనయాత్మచే నెవఁడు దెలిసికొనునో అతివర్ణాశ్రమియగు నాతఁడు సర్వలోకులకు గురువై ప్రకాశించును.

౬౬. ఆతఁడ వేదవిత్తముఁడ । ఘాంతకుఁడాతఁడ మోచక ప్రిదుం
డాతఁడ మోచకుండనఁగ । నాతఁడ యాతఁడ సర్వకారణుం

డాతఁడ నిత్య సిద్ధునస। మాచితుఁ డాతఁడ శ్రేష్ఠముక్తు డా
నాతఁడ సర్వపూజితుఁడు। నన్నిజగంబుల యందు నమ్యుతా

తా. ఓయచ్యుతా, ఎవండతి వర్ణాశ్రమి కాడో అతఁడు సర్వవేదములు దెలిసినవాఁడును, సర్వపాపములు నశించిన వాఁడును, సర్వపాపముల నశింపఁజేయఁ గల వాఁడును, తత్స్వరూపుఁడును, సర్వజగత్పూజ్యుఁడును, నగును.

*శివజ్ఞానోపదేశతుష్టుఁడై విష్ణువు శివునకు నమస్కరించుట*

సీ. సకలవేదాంతైక। సంసిద్ధమైనయీ
పరమార్థ మెల్లను। బరమ పురుష!
ప్రీతినీచేతఁ బ్రా। ర్థితుఁడనై యేనీకు
నఖిల సన్మునులకు। ననిమిషులకు
నరులకు నెఱిఁగితి। గరుణ సాక్షాన్ముక్తి
సిద్ధికినై కథిం। చితి ననవుఁడు
నమ్మహేశ్వరుని వా। క్యమ్ములు వినిభగ
వంతుఁ డచ్యుతుఁడు భు। వన మయుండు
తే. గీ. వాసుదేవుండు శ్రీసతీ। వల్లభుండు
తన శిరోమధ్యమున సుస్థి। తములుగాఁగఁ
జేసి పరమాత్ముఁడగు సదా। శివునిపాద
పద్మములుఁ గొలుచునపుడు తా। త్పర్య మొప్ప.

వ. అంత నత్యంత భక్తి పరవశుండగుచుఁ బులకాంకిత గాత్రుండును సలిలార్ద్ర నేత్రుండును గద్గద స్వర కలితుండును నై ... కుంఠుండు నీలకంఠున కనేక సాష్టాంగదండ ప్రణాంబు లాచరి... మహేశ్వర ప్రసాదంబున నిట్లు వేదాంతార్థంబును ముక్తి ప్రద... బును నైన బ్రహ్మ జ్ఞానంబునుం బొంది కృతార్థుండయ్యె నని ... సూతుండు మఱియు మునీంద్రుల కిట్లనియె.

తా. ఓపురుషోత్తమా, సమస్త వేద సారమగు నీపరమార్థము నంతయు నీయొక్క ప్రేమచేత నీచేఁ బ్రార్థింపఁబడినవాఁడనై మునులు, దేవతలు, నరులు, దీనివలన ముక్తినొందుట...

యందలి కరుణచేత సమస్త వేదసారమగు నీపరమార్థమునంతయు వచించితి నని శంకరుండు వచింప లక్ష్మీపతియగు వాసుదేవుఁడు తనశిరోమధ్యమున సదా శివుని పాదంబులునీ రెండును నుంచికొని భక్తిపరవశుఁడయి శరీరము గగుర్పొడువ, నేత్రంబుల నశ్రు బిందువులు గురియఁ గంఠముఁ గద్గదిక స్వరము నొంద ధ్యానించి యనేక సాష్టాంగ ప్రణామములుచేసి శివానుగ్రహ పాత్రుఁడయి బ్రహ్మజ్ఞానము నొంది కృతార్థుఁడయ్యెనని సూతుండు శౌనకాది మహాత్ములకు వచించి మరల నిట్లనియె.

—* సూతుఁడు మునులకు శివధ్యానము చేయుమని వచించుట. *—

ఉ. ఓ ద్విజవర్యులార! ముద । మొప్పఁగ మీరును మోచక ప్రవర్త
సద్వినయ ప్రయత్నముల । సంస్తుతి భక్తినెఱింగి తత్పదా
బ్జ ద్వయసేవఁ జేసి యస । శంబుఁ దదీయకృపావలోకనో
ద్యద్విమల ప్రబోధమునఁ । దన్మయ సౌఖ్యముఁ బొందుఁడిమ్ములన్.

తా. ఓ బ్రాహ్మణోత్తములారా! మీరును మహాభక్తియుక్తులై సర్వ జీవుల పాశమోచకుఁడగు శంకరుని ధ్యానించి యామహాత్ముని దయకుఁ బాత్రులై తన్మయులై బ్రహ్మానంద సుఖము ననుభవింపుఁడు.

క. వరభక్తి గురునియందున్
వారునందును గల్గువారమ । హాత్ముల కర్థో
త్కరముక్తిం జెందును శ్రీ
స్ఫురితంబుగ నతని యందు । సువ్రతులారా! ౨౦

తా. ఓ వ్రతగరిష్ఠులారా! గురువునందును శంకరునందును భక్తిగలవారలతిధన్యులు. అతి పుణ్యాత్ములు. వారికి సర్వకార్యములు సిద్ధించును.

వ. అనుటయు. ౨౧

తా. అనివచించగా.

క. అతివర్ణాశ్రమలక్షణ
మతివిశదంబుగ నెఱింగి । యమ్మౌని వరుల
ద్భుతపడి పరమజ్ఞానా
న్వితు సూతుని బహువిధముల । వినుతించిరొగిన్. ౨౨

తా. ఆమునీంద్రు లందఱు సూతునివలన నతివర్ణాశ్రమి స్వరూపము నంతయుఁ దెలిసికొని విజ్ఞాన శాలియగు సూతుని ననేక విధంబుల స్తుతించిరి.

క. కావున నతివర్ణాశ్రమి
యై వెలయు మహానుభావుఁ డగు సద్గురుపర్వ
భూనల యంబుసఁ గనుఁగొని
సేవింపఁగ వలయు మొదలఁ జిరతర భక్తిన్.

తా. కాఁబట్టి యతివర్ణాశ్రమి యగుమహాత్ముని భూమండలమున మహాభక్తి వెదకి గురువుగా గ్రహించ వలయును.

—* అతివర్ణాశ్రమిచేత దత్త్వజ్ఞాని కావలయు ననుట. *—

తే. గీ. తత్ప్రసాదాతిశయమునఁ ధన్యుఁడగుమఁ
బరము సుజ్ఞాన వైరాగ్య భక్తిభావ
మున జగత్రయంబునుఁ దృణాబుగఁ దలంచి
యతులబుద్ధి తత్త్వజ్ఞాని యగుట యొప్పు.

తా. ఆమహానుభావుని యనుగ్రహముననే ధన్యుఁడై భక్తి జ్ఞాన వైరాగ్య మ నొంది జగంబును దృణీకరించి మానవులు తత్త్వజ్ఞానము నార్జించ వలయును.

క. తత్త్వజ్ఞానము సిశ్చల
సాత్త్వికమతి నభ్యసించు సత్పురుషునకా
తత్త్వాతీత బగు పర
తత్త్వవివేకంబు గలుగుఁ దడయక జగతిన్.

తా. లోకంబున నెవరు సాత్త్విక బుద్ధితోఁ దత్త్వజ్ఞానము నభ్యసింతురో, వాని త్త్వాతీతమైన పరతత్త్వ వివేకము గలుగును.

వ. అట్టి పరతత్త్వజ్ఞాన ప్రకారం బెట్టిదనిన. జ్ఞాతృత్వ సమాన శ్రో త్రశబ్ద వాక్కులాకాశతత్త్వ పంచకంబగు. మనోవ్యాన చర్మస్ప ప్రాణులు వాయుతత్త్వ పంచకంబగు. బుద్ధ్యుదానచక్షూరూపపా దంబులువహ్నితత్త్వ పంచకంబగును. చిత్తాపాన జిహ్వా రసోప

లుజలతత్త్వ పంచకంబగును. అహంకార ప్రాణఘ్రాణ గంధ వాయువులు పృథవీతత్త్వ పంచకంబగును. ఇట్లు పంచభూతస్థితంబు లైన పంచవింశతి తత్త్వంబులు నెఱింగిన యతండు తత్త్వజ్ఞుడనం దగును అతండు ముక్తి పదప్రాప్తి కర్హుండగు. మఱియును. ౭౬.

పంచీకరణము.

శ్లో. "జ్ఞాతా సమానవాయుశ్చ శ్రోత్ర శబ్ద స్తథైవచ,
వాణీపంచ ఇదం ప్రోక్త మిత్యేతే వ్యోమపంచకమ్"

తా. జ్ఞాత సమానవాయువు శ్రోత్రము శబ్దము వాక్కు ఈమైదును నాకాశ తత్త్వ పంచకమని పేరు.

శ్లో. "మనశ్చవ్యాన వాయుశ్చ త్వక్స్పర్శశ్చ తథైవచ,
పాణిపంచ ఇదం ప్రోక్త మిత్యేతే వాయుపంచకమ్"

తా. మనస్సు వ్యానవాయువు చర్మము స్పర్శము హస్తము ఈయైదును వాయుతత్త్వ పంచక మనిపేరు.

శ్లో. "బుద్ధిశ్చో దానవాయుశ్చ చక్షూరూపం తథైవచ,
పాదపంచఇదం ప్రోక్త మిత్యేతే హ్యగ్ని పంచకమ్."

తా. బుద్ధి ఉదాన వాయువు చక్షుస్సు రూపము పాదము ఈమైదును నగ్ని తత్త్వ పంచకమనిపేరు.

శ్లో. "చిత్తంచ ప్రాణవాయుశ్చ జిహ్వాచరసఏవచ,
గుహ్యాపంచ ఇదం ప్రోక్త మిత్యేతే జలపంచకమ్"

తా. చిత్తము ప్రాణవాయువు జిహ్వారసము గుహ్యము ఈమైదును జలతత్త్వపంచకమనిపేరు.

శ్లో. అహం చాపాన వాయుశ్చ ఘ్రాణగంధ స్తథైవచ,
పాయుపంచ. ఇదం ప్రోక్త మిత్యేతే భూమిపంచకమ్.

తా. అహంకారముఅపానము ఘ్రాణము గంధము పాయువు ఈమైదును పృథివీ తత్త్వ పంచకమనిపేరు.

ఈయిరువది యైదు తత్త్వములును గూడి స్థూలశరీర మాయెను.

తే. గీ. అమర సద్ధ్యాత్మకాధి భూతాధికైన

తములు తత్త్వజ్ఞుఁడు దశేంద్రియములయందుఁ
గ్రమముతోడ నంతఃకరణముల యందు
నెఱిఁగి విభజించు విధమది యెట్టి దనిన. ౨

తా. మహాత్మా! జ్ఞానేంద్రియములందు– కర్మేంద్రియము లందు– నంతఃకర
చతుష్టయము నందును– నున్న యాధ్యాత్మము– అధిభూతము– అధిదైవము– నను
దత్త్వజ్ఞుఁ డెటుల విభాగించునో, ఆవిధంబు వచించెద.

## సాంఖ్య లక్షణము.

సీ. శ్రోత్ర మధ్యాత్మంబు శ్రోతవ్య మధిభూత
మధిదైవతంబు దిశాలి యందుఁ
జర్మమధ్యాత్మంబు స్పర్శయితవ్య మ
యధిభూత మధిదైవమ నిలుఁడందుఁ
జక్షుర ధ్యాత్మంబు చర్చింప ద్రష్టవ్య
మధిభూత మధిదైవ మర్కుఁడందు
జిహ్వామధ్యాత్మంబు స్పృష్టిరసయితవ్య
మధిభూత మధిదైవ మావరుణుఁడు
తే. గీ. నరయఁజక్కఁగ ఘ్రాణమ ధ్యాత్మకంబుఁ
జెంది ఘ్రాతవ్య మధిభూత మందునైన
నశ్వినులు నాఁగ నెగడిన యమరయుగ్మ
మలవడఁగ నధిదైవతం బంద్రబుధులు. ౨

## —* జ్ఞానేంద్రియ విభాగము. *—

| అధ్యాత్మము- | అధిభూతము- | అధిదైవము |
|---|---|---|
| శ్రోత్రము | శబ్దమువినుట | దిక్కులు |
| త్వక్కు | స్పర్శలఁ దెలిసికొనుట | వాయువు |
| చక్షువు | రూపముదెలిసి కొనుట | సూర్యుఁడు. |
| జిహ్వ | రుచులఁదెలిసికొనుట | వరుణుఁడు |
| ఘ్రాణము | వాసనలఁదెలిసికొనుట | అశ్వినులు. |

సీ. వాక్య మధ్యాత్మంబు • వక్తవ్య మధిభూత
మధిదైవతం బగ్ని • యుండుఁ బాణి
యధ్యాత్మకంబగు • నలదనా దాతవ్య
మధిభూత మధిదైవ • మందు నింద్రుఁ
డంఘ్రి యధ్యాత్మకం • బనఁజను గంతవ్య
మధిభూత మధిదైవ • మందువిష్ణు
డగుఁ బాయు వధ్యాత్మ • మలవిసర్జన
మధిభూత మధిదైవ • మంతకముగ
తే. గీ. నందు మిత్రుండు గుహ్యమ • ధ్యాత్మకంబు
నాఁద నరునధిభూత మా • నందమయ్యె
నభినుతింపఁ బ్రజాపతి • యాస్థలంబు
నందు నధిదైవ మయ్యెండు • నంద్రు బుధులు. ౭౯

—* కర్మేంద్రియ విభాగము *—

| | | |
|---|---|---|
| వాక్కు | సంభాషణము. | అగ్ని |
| పాణి | దానప్రతి గ్రహములు | ఇంద్రుఁడు |
| పాదము | గమనాగమనములు | ఉపేంద్రుఁడు |
| వాయువు | మలవిసర్జనము | మృత్యువు |
| గుహ్యము | ఆనందము | ప్రజాపతి |

వ. జ్ఞాతృత్వ మనోబుద్ధి చిత్తాహంకారంబులం తఃకరణ పంచకంబని చెప్పంబడు. జ్ఞాతయనగ జ్ఞానపురుషుండు. మనంబనంగ సంశయాత్మకంబు. బుద్ధి యనంగ నిశ్చయాత్మకంబు. చిత్తంబనంగ విచారాత్మకంబు. అహంకారంబనంగ నభిమానాత్మకంబు. మనంబధ్యాత్మకంబు. మంతవ్య మధిభూతంబు. చంద్రుఁడధి దైవతంబు. బుద్ధి యధ్యాత్మకంబు. బోధవ్య మధిభూతంబు. బ్రహ్మదేవుఁడందు నధి దైవతంబు. చిత్త మధ్యాత్మకంబు చైతన్య మధిభూతంబు. ని

త్రుండునధిదైవికంబు. క్షేత్రజ్ఞుండధిదైవతంబు అహంకారము
త్మకంబు. అహంకర్తవ్య మధిభూతంబు. రుద్రుండధిదైవతం

అంతఃకరణ పంచక విభాగము.

తా. జ్ఞాన- మనోబుద్ధి చిత్తాహంకార ములను- అంతఃకరణపంచక మనంబ జ్ఞానమును తెలిసికొను పురుషుడు జ్ఞాతయనియు. సంకల్పాత్మకమైనది మనస్సనియు. నిశ్చయించునది బుద్ధియనియు, విచారించునది చిత్తమనియు, నేనేచేయుదును, అనున హంకార మనియు, వచింపఁబడును.

| అధ్యాత్మము | అధిభూతము | అధిదైవము |
|---|---|---|
| జ్ఞాత | జ్ఞేయము | కూటస్థుడు |
| మనము | సంకల్పవికల్పములు | చంద్రుడు |
| బుద్ధి | నిశ్చయము | బృహస్పతి |
| చిత్తము | చంచలము | క్షేత్రజ్ఞుడు |
| అహంకారము | అహంకర్తవ్యము | రుద్రుడు |

క. ఈవిధమెల్లం దెలియుచు
భావంబున సద్వివేక । పరిపూర్ణుండై
పావన తత్త్వజ్ఞాన
శ్రీవిలసితుఁడైనభవ్య । శీలుండతఁడా.

తా. ఈప్రకారముగా తత్త్వవిభాగముఁ దెలిసికొనుచు, వివేకాతిశయము కలి
త్వజ్ఞానము నార్జింపుచు జ్ఞానికావలయును.

సీ. ఏనుభూతగుణేంద్రి । యానీకములు గాను
తనుమనోబుద్ధిచి । త్తములు గాను
గానహంకారంబు । గాను ప్రాణంబును
వర్ణాశ్రమంబుల । వాఁడఁగాను
గానుధర్మాధర్మ । కర్మాభిరతుఁడని
కడముగ సర్వప్రపం । చమును గాను
నిరుపమానేకంబు । నిత్యంబు శాంతంబు
బుద్ధపదంబు సం । శుద్ధమజము

తే. గీ. నిశ్చలము నిర్గుణము మహా । నీయమచ్యు
తంబు శివమనం దగునట్టి । తత్వమెద్ది
యద్ధియ నేనౌదు ననిముందం । బారనాత్మ
దలంప నేర్పుట ముక్తి ప । దంబుం గనుట. ౮౨

తా. తిరునాతినారాయణు,పంచభూతములు గాని, ఇంద్రియములు గాని, గుణములు గాని, యహంకారముగాని, వర్ణాశ్రమంబులు కలవాఁడుగాని, ధర్మాధర్మము లాచరించు వాఁడు గాని కర్మరతుఁడు గాని, యాదృశ్య ప్రపంచము గాని, నేను గావని దెలిసి కొని, నిత్యశుద్ధబుద్ధ స్వరూపము- నిశ్చలము- నిర్గుణము- శివస్వరూపము నగు నే మహా తత్వము గలదో, అదియే నేనని యాత్మయందు నిశ్చయింప నేర్పుటయే ముక్తిస్థానమును జూచుట- యనితలంచవలెను.

వ. మఱియు దేహిదేహ మాయామాయాపస్థూల సూక్ష్మ కారణ తనుత్రయంబును శ్రోత్రాది జ్ఞానేంద్రియ వాగాది కర్మేంద్రియ శబ్దాది విషయేంద్రియ మానసంబులకు షోడశ వికారంబులును సప్తదశ లింగంబులును ప్రాణాది వాయువులును దశేంద్రియంబు మనోబుద్ధులని చెప్పంబడు. ప్రకారాంతరంబున నాకాశాది బీజ భూతంబులును జ్ఞానేంద్రియములు కర్మేంద్రియంబులు బుద్ధి పాణంబులు ననందగు ననియును కర్తృకర్మకార్య జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ భోక్తృ భోగభోగ్యంబులును నన నవవిధ పదార్థంబులును, పృథివ్యాపస్తేజో వాయు రాకాశ మాయా మహదహంకారంబులని చెప్పందగిన యష్టవిధ ప్రకృతులు నాత్మని నెఱింగి వాని కన్నింటికి నన్యుండనియును ముక్తానంద స్వరూపంబైన "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" యనుశ్రుతి వచనంబునం బ్రసిద్ధమైన యది తానాదునని యెంచి,ఆత్మను"తత్త్వమస్యాది" వాక్యార్థంబుల వలనం దెలియ వలయును. అదియునుం గాక. ౮౩

తా. జ్ఞానేంద్రియములు- కర్మేంద్రియములు- పంచతన్మాత్రలు- స్థూల దేహమనియు, పంచప్రాణములు- మనోబుద్ధులు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు సూక్ష్మదేహమనియు, అవిద్యయే కారణ శరీరమనియు, వచింపఁ బడినది. మరొకవిధమున నాకాశాది బీజములును జ్ఞానేంద్రియ కర్మేంద్రియములని యనఁబడు. మఱియు, ఆకాశది

భూతములు- జ్ఞానేంద్రియ కర్మేంద్రియ బుద్ధిప్రాణములని చెప్పంబడును.

కర్త- కర్మ- కార్యము- జ్ఞాత- జ్ఞానము, జ్ఞేయము, భోక్త, భోగము భో
అను తొమ్మిది పదార్థములను, భూమి, యుదకము తేజస్సు వాయువు, ఆకాశ
ము, అహంకారము, అను తొమ్మిది ప్రకృతులను, ఆత్మను దెలిసికొని, వీటి కన్నిటి
గానుండు వాడేననియు, సత్య జ్ఞానానంద స్వరూపుడగు నా బ్రహ్మ పదార్థము నే
యని తెలియగవలెను. "తత్వమసి" "ప్రజ్ఞానంబ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" అహం
బ్రహ్మాస్మి" యనెడి మహా వాక్యముల వలన నాత్మ తత్వమును దెలిసికొన వలయును.

క. అదిగానిదిగా ననసె
యాదియగు మనసునకు నింద్రి। యముల కగమ్యం
బదిదానిని మదిసర్వము
నదియుదియును నేనకాదె। యనితలం పదగున్.

తా. నేనదిగాను. ఇదిగాను. అనంగా నేదిమనస్సునకు నింద్రియములకు
చుచున్నదిగాదో అదియును ఈదృశ్యంబును నేనేయని తలంపవలయును.

తే గీ. మూఢము త్రోడ "జ్ఞానాదేవ। మోక్షు" మనెడి
వాక్య మంగీకరించి భా। వంబు నాటి
జ్ఞానయోగంబుఁ దిరముగా। సంఘటించి
జనుఁడు భవముక్తుఁడగు నిది। సాంఖ్య మతము.

తా. మానవులు "జ్ఞానాదేవ చ కైవల్యం" అను వాక్యమును సరించి శన
వలన యోగము స్థిరముగ బాదుకొలిపి సంసారము నుండి విముక్తి బొంద వలెను.
సాంఖ్యమత మని చెప్పంబడును.

—*తారక లక్షణము. *—

క. కనుఁగొన సాంఖ్య జ్ఞానం
బునకుఁ బరమగుచు లోక। మునఁగడు గుహ్యం
బును దృష్టప్రత్యయయుత
మును నయ్యెదారకంబు। బోధాత్మకమై.

తా సాంఖ్య జ్ఞానము కంటె నుత్తమమై రహస్యమై ప్రత్యేకఫలము
చుఁదారకము ప్రసిద్ధి గాంచినది.

క. తారక యోగంబమల వి
చారుల నందగు యమీంద్ర । జనులకుఁ బ్రమదం
బారఁగ ననుభవ సిద్ధము
పారమర్థిక సద్గురు ప్రే । సన్నతకతనన్. ౮౭

తా. సద్గురు ప్రసాదంబు గలిగిన యోగీంద్రుల కీతారక యోగమే సంతోషమొ
సగూర్చును. ఇయ్యది యనుభవసిద్ధము.

తే గీ. మంత్రిలయ హఠయోగ స । మభ్యసనము
లందు బ్రహ్మ సాక్షాత్కార । మైనదాఁక
నుడుగ కెల్లపుడును గ్లేశ । పడుదు రల్ప
బుద్ధులెంతయు భ్రాంతులై । భూతలమున. ౮౮

తా. బ్రహ్మ సాక్షాత్కారము గలుగునంత వరకు లయ హఠ యోగముల నిరతా
భ్యాసంబున నల్ప బుద్ధి గలమానవులు కష్టపడు చుందురు.

మ. కన్నులు మూసియైన, నర । గన్నులు చెన్నొల యుంగ నైన, బ్రి
హ్మాన్నతి లోనికంటఁగను । చుండఁగ వచ్చు నహర్నిశంబునా
త్మోన్నిగమాంత వేద్యమగు । తారక యోగమునంబ్రవీణుఁడై
యున్న మహానుభావుఁడగు । యోగియు, నెల్లెడనశ్రమంబునన్. ౮౯

తా. ఏపురుషుఁడీ తారక యోగము నభ్యసించునో, అతఁడు కన్నులు మూసియు
ను– తెరచి యున్నను లోనిచూపుచేత నాపర శివతత్వమును నహర్నిశము శ్రమ లేక
చూచు చుండ వచ్చును.

క. తారాధిప తపనాంతర
తారాగ్ని స్థితములైన । తత్తేజములం
దారక బిందువుఁ గూర్పం
దారక యోగంబటందురు తత్త్వవిధిజ్ఞుల్. ౯౦

తా. కనుగ్రుడ్ల యందుఁ బ్రకాశించు చున్న చంద్ర సూర్యుల తేజస్సులతో బిం
దువు గూర్చుటయే తత్వజ్ఞులు తారక యోగమందురు.

తే. గీ. తారక బ్రహ్మవిద్యాని । ధానమొప్ప
నరుఁడు లోపలి వెలుపలి । నడిమిలక్ష్య
......

ములఁ గనుఁగొనఁదగు దృష్ట । ములు నదృష్ట
ములునునగు బహువిధరూప । ములు క్రమమున.

తా. తారక బ్రహ్మనిద్య నార్జించిన మహాపురుషుఁడుబహిర్లక్ష్యాంతర్లక్ష్య లక్ష్యములచేత దృశ్యాదృశ్యములందలిబహువిధ రూపముల గనుంగొన నగును.

వ. అట్టి లక్ష్యత్రయప్రకారం బెట్టిదనిన.

తా. ఆలక్ష్యత్రయము దెలిసికొను విధ మెట్టులన:-

—* లక్ష్యత్రయవివరణము. *—

సీ. బ్రహ్మనాడి శశిప్ర । భావిభాసితయగు న్బ్ర
హ్మల మూలకందంబు । వలననుండి
దండలగ్నయి నయ్యెఁ । దన్మధ్యమునఁదటి
త్కోటి సంకాశమై । కొమరు మిగులు
నాబ్రహ్మ రంధ్రప । ర్యంతంబుగా బిస
తంతు సమానమై । తనరు నూర్ధ్వ
గామినియై సిద్ధి । కరియగు నమ్మూర్తి
మనసున వీక్షించు । జనుఁడు నిర్మ
తే. గీ. లుండు నిటలోర్ధ్వ గోల్హాట । మండలంబు
నందు ననవరతంబు సం । యమి వరుండు
విస్ఫురిత తారకాకార । వీక్షణంబు
చేయుచుండిన శివయోగ । సిద్ధుఁడగును.

తా. చంద్ర కాంతిచేఁ బ్రకాశించు బ్రహ్మనాడి యాధార స్థానము నుండి దండమునఁ గలసికొని యుండును. దానిమధ్య యందు గోటి మెఱుపుల కాంతి స హామునవిరాజిల్లుచుబ్రహ్మరంధ్రము వఱకు- దామర తూడులోని దారముఁవలె మెల ర్ధ్వ భాగమునకేగుచు కార్యసిద్ధి నొసంగు నామహా మూర్తినిమనస్సునఁ జూచి డుధ్యానించునో, వాఁడే నిర్మలుఁడు. ఎవఁడుఁలలా టోర్ధ్వ భాగంబు నందలి మండ దారకా కృతిని వీక్షించు చుండునో, వానికి శివయోగసిద్ధి కుదుర గలదు.

తే. గీ. తజ్ఞులచేతఁ గణ్ణరం । ధ్రములు రెండు

నెట్టికొని మూసిపట్టి శ్రు ॥ హస్తమస్త
కస్థలమ్మున నోంకార ॥ కలితరవము
లీలనాలింపఁ దలపంను ॥ లీనమగును. ౯౮

తా. తర్జనులచేత రెండుకన్ల రంధ్రములను మూసి శిరోభాగము నందలి యోంకా
నాదమును వినచోఁ దనతలంపును లీనమగును.

క. దక్షిత నంతర్దృష్టి
న్వీక్షింపఁగ వలయు విమల ॥ నీలజ్యోతిం
జక్షుర్లక్ష్యాంబునసం
దక్షీణ సుఖంబు గలుగు ॥ యమి వర్యులకున్. ౯౯

తా. సమర్థుడగు సంయమికి లోనిదృక్కుచేత నేత్ర మధ్యంబున వెలుంగు నీల
కాంతినిఁజూచినప్పుడు గలుగు నానందమునకు మితిలేదు.

క. అంతర్లక్ష్య విధానం
బింతయు నిబ్భంగి నార్య ॥ లేర్పఱిచిరి ము
న్నెంతయు ముముక్షువులకున్
సంతోష కరంబుఁ గాఁగఁ ॥ జతురత మెఱయన్. ౧౦౦

తా. పూర్వపు మహాత్ములు ముముక్షువుల కెల్లరకు సుఖంబు గలుగుటకై యావి
ధముగ నంతర్లక్ష్య విధి నేర్పరచిరి.

—* బహిర్లక్ష్యవివరణము. *—

చ. వెలుపలి నాసికాగ్రమున ॥ వేదరసన్వివ దిగ్దినేశ సం
ఖ్యలుగల యంగుళాంతరము ॥ లందు నభోముఖ తత్త్వపంచకం
బలవడునీల ధూమ్ర సము ॥ దంచిత రక్తతరంగ కాంతులు
న్నెలయ వెలుఁగుచుండు సుమ ॥ నోగతి వానిదలంపమేలగున్.

తా. బయట యున్న నాసిక యగ్రభాగమున 4- 6- 8- 10- 12 అంగుళములప
ర్య యందు- ఆకాశాది పంచకము నీలాది కాంతులతోఁ బ్రకాశించు చుండును. మన
స్సైర్యమున వాని దలంపు మన్న శుభం బగును.

సీ. సమ్ముఖాకాశంబ ॥ చంచల దృష్టినీ
క్షింపుచుండెడి ధీర ॥ చిత్తుఁడైన

యోగి వశ్యునకు వే । వేగ జ్యోతిర్మ యూ
ఖములు గట్టెదురున । కానవచ్చు
దృష్ట్యగ్రిమునసైన । ధీయుక్తమగు నపాం
గమునసైనను దప్త । గాంచనంబు
బోలెడి భూమిపై । మాలోక నంబొన
రింపగ దృష్టిచ । లింపకుండు
తే. గీ. శిరసుపై ద్వాదశాంగుళ । పరిమిత ప్ర
దేశమున నిరాకారమై । దివ్యమగుచుఁ
బొలుపు మిగులు జ్యోతిః పుంజ । మున్నతమున
దర్శనముసేయు నది యమృ । త పదంబు. ౮

తా. నిశ్చల దృష్టితోఁ దనపురో భాగమందలి యాకాశమును నేధీరుఁడు వీక్షించు చుండునో, అధీరుఁడైన యోగీంద్రునకు జ్యోతిః పుంజమెదుర్గా గన్పించు చుండును. దృష్టిచేఁ గాని, కటాక్షమునసైన గాని, భూమిఁజూచు చుండిన దృష్టి చలింపక శిరంబు మీదద్వాద శాంగుళ ప్రమాణము దూరమున నిరాకారమై వెలుంగు తేజఃపుంజమును జూచినచో, అదియమృత ప్రదమగును.

క. ఎక్కడఁ జూచిన యోగికి
నక్కడ నాకసము చూచు । నవధానము సొం
పెక్కఁగఁ గలిగిన చిత్తం
బక్కజము గఁడాదృశం । బయగు నాతనికిన్. ౯

తా. అవధాన మొందిన యోగికి నెక్కడఁ జూచిన నక్కడనే మహాకాశముగన్పించును. చిత్తము తద్గాప మొందుటయే యిందుకు నిదానము.

వ. ఇట్లనేక విధంబులం గలిగి యుండు బహిర్లక్షణంబు. ౧౦

తా. బహిర్లక్ష్యము నందిటులనేక భేదంబు లుండును.

—* మధ్య లక్ష్య వివరణము. *—

తే. గీ. తెలుపు మొదలుగ నెల్లవ । న్నెలన ఖద్య
చంద్ర రవిబింబములఁ దటి । జ్జ్వలన శిఖల

నభిన వోజ్జ్వలస్థల విశిూ కైనైక నభము
నాత్మగనుటది మధ్యల క్షేత్ర్యంబు విధము ౧౦౧

తా. తెలుపు- ఎఱుపు మొదలగు కాంతులందును- ఇంద్ర మూర్య ప్రభలందును మెఱుపు తీవెల మెఱుపు లందును, అగ్ని శిఖలందును, నాధారములేని యాకాశంబు గనుటయే యాత్మను గనుగొనుట. దీనినే మధ్య లక్ష్యమందురు.

లక్ష్యములు త్రివిధములు.

బహిర్లక్ష్యము- నేత్రములఁ దెరచి మనస్సును వృత్తులకుఁ బోనీయక యొక వస్తువ యందుఁ గదలనీయక నిలుపుట. ఇందు దృశ్యమందు లక్ష్యమందు లక్ష్యమును నిలుపు నది. ప్రథమ మందు బహిర్లక్ష్యమును నభ్యసించునది.

2 మధ్యలక్ష్యము- నేత్రములఁ దెరచిమనస్సును వృత్తులకుఁ బోనీయక యభి ముఖము చేసికొని భ్రూమధ్య మందు లక్ష్యమును నిలుపునది. ఇందు దర్శనము (చూపు) నందే లక్ష్యమును నిలుపునది. బహిర్లక్ష్యమందునిలిచిన పిమ్మట మధ్యలక్ష్య మభ్యసించునది. ఈ రెండులక్ష్యముల భ్యాస మయిన పిమ్మట యంతర్లక్ష్య మభ్యసించునది.

3 అంతర్లక్ష్యము— నేత్రములఁ దెరచి శ్రోత్రత్వ క్చక్షు ర్జిహ్వా ఘ్రాణేంద్రియములను జ్ఞానేంద్రియములు వాక్పాణి పాదపాయూ పస్థలను గర్మేంద్రి యములు మనోబుద్ధి చిత్తాహంకార ములును అంత రింద్రియములును నీపదునాలు గింద్రియములును జయించి దృష్టిని శబ్దగుణకంబును పంచభూతాత్మ కంబును నగునాకాశంబునందువదలి మనస్సును వృత్తులకుఁ బోనీయక యభిముఖము చేసికొని భ్రూమధ్యమున కంత రముగా లక్ష్యమును నిలిపి యక్కడి వింతలను జక్కఁగఁ జూచునది ఇందు ద్రష్టయందు లక్ష్యమును నిలుపు నది. ఇదియ శాంభవీ ముద్ర.

వ. మఱియు నిరా కారంబైన గుణరహితా కాశంబును, విస్ఫురత్తార కా ఘూర్ధతమో రూపంబైన పరా కాశంబును, గాలానల నిభంబైన మహాకాశంబును, నపరిమిత పరమ ద్యుతిభరితంబైన తత్త్వాకాశంబును, రవిశత సంకాశంబైన సూర్యా కాశంబును ననంబరఁ గిన బాహ్యాభ్యంతర సంస్థితంబులైన యీ యాకాశంబు లైదునుం దారక లక్ష్యంబున పేక్షించు నతఁడా కాశ సదృశుఁడగు నదియుం గాక. ౧౦౨

తా. ఆకాశంబు లైదుగలవు అవియేవియనః—

| పేరు. | రూపములు. |
|---|---|
| గుణరహితాకాశము | నిరాకారము_ రూపము |
| పరాకాశము | తమస్సు- రూపము |
| మహాకాశము | ప్రళయ కాలాగ్ని రూపము |
| తత్వాకాశము | పరమద్యుతియే, రూపము |
| సూర్యాకాశము | రవిశత కాంతి రూపము |

ఈ సూర్యాకాశము లైదెంటిని తారక లక్ష్యమునఁ జూచువాఁడే యాకాశే తుల్యుఁడగును. మతియు

క. తారకము దుర్భవాంబుధి
తారక మమనస్క- సిద్ధి * దాయక మగుటం
దారక యోగాభిజ్ఞులు
తారి కదాయిందు నందుఁ * దద్దయు ధన్యుల్. ౧౦౭

తా. దుఃఖముల కాకరమగు నీసంసారము నుండి తరింపఁ జేయుశక్తి గలిగి యమనస్క- సిద్ధి నొసంగు నీతారకము నభ్యసించిన వారు ధన్యులు.

ఆ. వె. చర్య వేఱుగాను * సత్ఫలమేకంబు
సాంఖ్య యోగములకు * జగతిలోన
నెరయ సాంఖ్యమెల్ల * నిరుపాధికంబు సో
పాధికంబు యోగ * భావమెల్ల. ౧౦౮

తా. సాంఖ్య యోగములకు, చర్యవేరుగా నుండును. ఫలంబేకమై ప్రకాశించును. ఈసాంఖ్యము సోపాధిక మని నిరుపాధిక మని రెండు విధములు.

క. అమల నిగమోప నిషద
ర్థములందుఁ సారతరము * తారక మను యో
గము దీనికిఁ బరమనఁ దగు
నమనస్కం బపరిమిత సు * ఖాస్పదము గదా. ౧౦౯

తా. తారకము వేదములందునుపనిషత్తు లందునుగల యోగ ములలో శ్రేష్ఠమైనది. ఇదియుపంతిసుఖంబు నొసంగును.

వ. అట్టి తారకామనస్కంబులు రెండును బాహ్యాపరయోగంబు
లని చెప్పంబడు నీయర్థంబును యోగజంబను దివ్యాగమంబు
నం బ్రసిద్ధంబది యెట్లనిన. ౧౦౬

తా. యోగంబను దివ్యాగమము నందుఁ బాహ్యయోగము తారక మనియు, అపర యోగము "అమనస్కము" నియు వచింప బడినది.

—* వామదేవ మహర్షి జీవన్ముక్తిని గూర్చి శివుని నడుగుట *—

శా. శ్రీకైలాస నివాసు శర్వునభవుం ♦ హృద్గోచరున్ భక్తర
క్షాకౌతూహల చిత్తు సర్వగతునిన్ ♦ సర్వేశు సర్వజ్ఞు శాం
తాకారున్నివుఁ జేరి యర్థిన మితుం ♦ డై వామదేవుండు లో
కైకస్తుత్యుఁడు సన్ముని ప్రవరుఁడు ♦ ద్యద్భక్తితో నిట్లనున్. ౧౦౭

తా. కైలాస పర్వతంబున వసింపుచు, భక్తరక్షా పరతంత్రుఁడై ప్రకాశించుచున్న సర్వేశ్వరుని యొద్దకు యొక్క సమయంబున మునిశ్రేష్ఠుఁడగు వామదేవ మహర్షి వెళ్లి భక్తి వినమిత గాత్రుఁడై యిట్లు ప్రసంగించెను.

మత్తకోకిల.

దేవదేవ మహేశ హైమవ ♦ తీ మనోహర శ్రీమహా
దేవ! విష్ణు విధాతృవందిత ♦ దివ్యపాద పయోరుహా
భావజాంతక మృత్యు సంహర ♦ భక్తవత్సల శాశ్వతా
నీవనాకు ప్రభుండ వెప్పుడు ♦ నీలకంధర శంకరా! ౧౦౮

తా. ఓపార్వతీ పతీ! సర్వ దేవతలచే నమస్కరింపఁ బడుచున్న నో మృత్యుంజయా? ఓభక్తవత్సలా? నీవు దప్ప నాకెందును బ్రభువు లేడుసుమా?.

క. సర్వాత్మ సర్వకారణ
సర్వానంద స్వరూప ♦ సర్వాధారా
సర్వానుగ్రహ కారణ
సర్వాధిప శర్వనీవ ♦ శరణమునాకున్. ౧౦౯

తా. సర్వంబునకు గారణమును సర్వంబున కధిపుండవును, సర్వానుగ్రహ కారణుండవును నగునీవె నాకు రక్షణము.

క. జీవన్ముక్తి కదంబుగ
భాషమలరఁ బొందుటకును । పాయంబుఁ గృపా
శ్రీవెలయఁగ నాకానతి
యీవలయు సమస్తలోక । హితచరితశివా. ౧౧౦

తా. సమస్త లోకములకు హితకారి యగునో మహానుభావా! జీవన్ముక్తిని బొందు నుపాయము నాక నుగ్రహింపుము.

వ. అని విన్నవించిన వామదేవునకు శ్రీమహాదేవుండిట్లనియె. ౧౧౧

తా. అని ప్రార్థించుచున్న వామదేవ మహర్షికి మహాదేవుండిటుల వచింపదొడంగె.

—✻ శివ వామదేవ సంవాదము ✻—

తే. గీ. వినుమువత్స మహాప్రాజ్ఞ । వేడ్కనిపుడు
నీవడిగి నదియాగమ । నికరగోప్యఁ
తెంబు సంసారసాగర । తారకంబు
తెల్లముగ నగమ్యము సర్వ । దేవతలకు. ౧౧౨

తా. మహాప్రాజ్ఞుఁడవగునో వామదేవ మహర్షీ! నీవునన్ను బ్రశ్నించిన విషయము మహారహస్యము. దేవతలకును దెలియ నశక్యము సంసారమునుండి తరింపఁజేయునది. ఆగమశాస్త్ర ప్రసిద్ధము సుమీ!

క. వినుము 'బాయక నీయం
దూనిన యద్వైత వాస । నోన్నతి యుదిరం
బై నాయందున హేతుక
మానిజ భక్తియును జూచి । హర్షాత్ముఁడనై. ౧౧౩

తా. మునీంద్రా! అంతటి గ్రహింపగాని విషయమైనను నీమనంబున నద్వైత భావన దృఢముగాఁ గలదు. మఱియు నాయందు నిర్హేతుకముగా భక్తిఁగలిగి యుంటివి. ఈ రెంటిని జూచిననా కపరిమిత సంతోషము గల్గినది.

ఉ. అప్పర మోపదేశమున । కర్హుఁడ విప్పుడ నీవకావునఁ
జెప్పెదనీకు నవ్విధమ । శేషము నందు కుపాయమారయం

దప్పుడు వేయునేటికిని । దారక యోగము దానికాది పె
ద్దొప్పఁగనుత్తమోత్తమము । యోగములందుఁదలంచిచూడఁగన్.

తా. తపోధనా! ఈవిమలరూప దేశమునకు నీవే యర్హుఁడవు. నీకంటె నెవరును లేరు. కావున నేవచించెద. వినుము. జీవన్ముక్తికి నిధాన మైనది. జీవన్ముక్తిని గలిగించునది తారక యోగము సుమా! తారకమగునీతారకమార్గము-యోగములలో శ్రేష్ఠమైనది

సీ. అదియు రెండు విధంబు । లై యుండుఁ బూర్వాప
 ర విభాగములు గల్గి । క్రమముతోడఁ
బూర్వంబు తారకం । బును నపరము రాజ
 యోగంబు నగునందు । నెనర మొదలఁ
గధియింతుఁ బూర్వయో । గము సర్వమూర్తిమ
 యంబును రూపగు । ణంబులైన
యింద్రియాంతరము నం । దేర్పడఁ గాద్వధా
 కృత మనోయుక్తమై । వితతలీలఁ
తే. గీ. దనరు నాతారకము భవ । తారకంబు
 తారక జ్యోతిఁ గూర్చి య । త్నమున భ్రూయు
 గం బాకించుక యెత్తిన । క్షణములోన
 నున్న దిది హేతు వినపూర్ణ । యోగసరణి. ౧౧౯

తా. ఈతారక యోగము, తారకయోగమని రాజ యోగ మని రెండు విధములు వీనికిఁ బూర్వ యోగమని, అపరయోగమని నామములు గూడ గలవు. తారక మనఁగా-సర్వమూర్తి మయమై రూపమే గుణముగాఁగల నేత్రేంద్రియ మధ్యయందు రెండుగాఁ జేయఁ బడిన మనంబుతోఁ గూడికొని యున్నయా తారకమును నామహాజ్యోతితోఁ బ్రయత్నమునఁగలిపి కనుబొమల రెంటిని గొంచెమెత్తి క్షణ కాలము నాభావనతో నుండుటయే తారక మందురు.

* తారకమహిమ *

క. ఈయోగ విద్యనాచే

నాయతి సర్వజ్ఞతయు । ను నఖిల శుభములుం
బాయక బ్రహ్మకు గలుగుట
కై యిట్లు చెప్పఁబడి యో । గరు దారంగన్. ౧౧౬

తా. మునీంద్రా! సర్వజ్ఞత్వమును- సర్వశుభములను బ్రహ్మకుగలుగుటకై ఈ
సు నీకీయోగ ముపదేశించితి.

ఉ. కొందఱు మంత్రతత్పరులు । కొందఱుధ్యానమునన్ విమోహితుల్
కొందఱిలన్ హఠాభ్యసన । గోష్ఠి వహింతురు తర్క కర్కశుల్
కొందఱు వేదపాఠకులు । కొందఱు చిక్కుడు రాగ మంబులం
గొందఱు తారకంబునదిఁ । గూర్పనెఱుఁగరు భ్రాంతులింపుఱన్,

తా. లోకంబున భ్రాంతిచేఁ గొందరీ మంత్రమునే నమ్మి జపించు చుందురు. కొం
దఱు పరశివధ్యానమే యుచితమని ధ్యానింతురు. కొందఱు చిలుక పలుకులవలె శాస్త్ర
ములు-వల్లింతురు.కొందఱు వేదములువల్లె వేయుదురు. కాని భ్రాంతిచే తారకయోగమభ్యసింపు

క. గురుశిష్యుల భవజలధి
తరియింపఁగఁ జేయుకతన । దారోన్నేష
స్థిరయోగంబున సుఖ
కరమీ యోగంబు తార । కంబనఁ బరఁగున్. ౧౧౭

తా. సంసార సముద్రమునుండి గురుశిష్యుల నిరువురిని దరింపఁ జేయుట వల్లను-
దృక్ప్రకాశ స్థిరత్వము వలనను- నీతారకయోగము సుఖకరమైనది.

క. తారక యోగానుగ్రహ
కారక మహిమాధ్యుఁడై జ । గద్వినుత సదా
చారుఁడగు నతఁడు గురుఁడు ప్ర
తారకుఁ డన్యుండు మౌనిక । దంబకముఖ్యా!. ౧౧౮

తా. ఏమహాను భావుఁడీ తారకవిద్య నభ్యసించి దానివలన మహా మహిమ గలిగి
జగత్తునందు జనులచే శ్లాఘింపంబడు చుండునో, మునీంద్రా? అతఁడే గురుఁడు సుమా!
తదితరులు వంచకులని తలంచుము.

వ. తత్త్వ సంప్రాప్తి నిజగురు ముఖంబునం దక్కఁ దక్కిన మీమాం

స తర్కగ్రహగణిత సిద్ధాంత పఠనంబులను వేద వేదాంత శ్రుతిస్మృతి పురాణ వివిధాభిధానంబులను ఛందో వ్యాకరణ కవితాలంకార పికరంబులఁ గలుగ దది గలుగ కుండిన నన్నియు నప్రయోజనంబులు. ౧౨౦

తా. తత్వజ్ఞానము సాధింప వలయుననిన యెడల గురుముఖము వలననే పొంద వలయును. గాని తర్క వ్యాకరణాది శాస్త్రముల వల్లించుటచే నయ్యది కలుగనేరదు. తత్వజ్ఞానము కలుగకున్న చదివిన చదువు లన్నియు బూడిదెలోఁ బోసిన నాజ్యము వంటివి యగును.

చ. పనుపడ దృశ్య బాధమునఁ । బాసియ చంచలమైన దృష్టియె
వ్వని కగు నప్రయత్నమున । వాయువు సుస్థిర మైతనర్చునె
వ్వని కవలంబ కర్మ పరి । వర్జితమై చిర మొందుఁ జిత్తమె
వ్వనికి నతండు యోగిబుధ । వర్యుఁడతండ యతండు సేవ్యుఁడుర్విన్. ౧౨౧

తా. ఏమహాత్ముని దృష్టి బంధము నొందక స్థిరత్వము నొందునో, ఎవనికి నప్రయత్నముగ వాయువు స్థైర్యము నొందునో, ఎవని చిత్తము కర్మలంపటముగాక పరమేశ్వర ధ్యాన మగ్నమగు చుండునో, అతఁడే యోగీంద్రులలో నుత్తముఁడు. సేవింపఁదగినవాఁడు సుమీ?.

క. ఈవిధ మెల్లను సద్గురు
దేవుని వలనన్ బుధుండు । దెలిసి యపుష చిం
తావర్జితుఁడై యోగము
శ్రీవిలసిత భూమినభ్య । సింపఁగ వలయున్. ౧౨౨

తా. ఈసంగతి యంతయుఁ గురువు వలన దెలిసికొని జనరహితమగు పరిదేశమున గూర్చుండి యోగము నభ్యసించ వలయును.

వ. మునీంద్రా నీవును వివిక్త దేశంబునను మానసంబున సుఖాసనసన్నివిష్టుండవై కించిత్ప్రచ్ఛిమోపేత శ్రద్ధాగుండవై బహుప్రమాణస్థిత దృగ్వి భాసితుండవై చింతా విహీనుఁడవై యోగాభ్యాసంబు గావింపు మివ్విధంబున యోగాభ్యాసంబు సేయు నతనికి మనంబు సుస్థిరంబగు. మనంబున వాయు వాకాశ యదృష్టి స్థి

రత్వంబులు గల్గు నుదాసీనుఁడయి యున్న యజమానుని మనస్సునకు నవియెల్లు సుస్థిరతం బొందు. శరీరంబునకు మృదుత్వం బును సత్వంబును సంభవింపుచుండు. ౧౩

తా. ఓవామదేవ మునీంద్రా! నీవుతు విజన ప్రదేశమున సుఖాసీనుఁడవై చింతన్నియు వదిలి యోగము నభ్యసింపుము. యోగమభ్యసించినచో మనంబు చాంచల్యము నొందదు. మనస్సు స్థిరత్వ మొందిన-వాఙ్నియమము- శరీరమునకు బలమును సత్వగుణము కలవడును.

సీ. కాషాయ పటపరి । గ్రహణంబు దండంబు
 ధరియించుట కపాల । ధారణంబు
పోలింప గేశాన । లీలుంచ నంబు పా
 మండ వ్రతంబులు । సలుపుచునికి
భస్మచీవర జటా । భారత్వ మున్మత్త
 వృత్తినుండుట బహు । వేషనిరతి
నగ్నత్వమట నిపు । ణత పెంపు దీపింప
 మధుర గంభీర వా । క్పౌఢి కలిమి

తే. గీ. రమణమిగుల సభాభ్యంత । రంబునందు
 నాగమశ్రౌతి స్మృతికవి । తాది గోష్ఠి
 భువినఖిలమును నుదర ప్ర । పూరణార్థి
 నటనమయ్యె శ్రేయఃకార । ణంబు గాదు. ౧౪

తా. కాషాయ వస్త్రములు కట్టుకొనుట- దండము పట్టుకొనుట- జటాభారము వహించుట- దిగంబరి యగుట- ఉన్మత్తుఁడుగా నుండుట- అనేక వేషములు వేయుట- శాస్త్ర కవిత్వాది ప్రసంగము- ఇవి యన్నియు విచారింపఁగాఁ బొట్టపోసికొనుటకు మార్గములు గాని, మోక్ష మార్గములు గావు, మనోస్థైర్యము కుదిరి యుని యున్న మోక్ష మొందవచ్చును.

వ. అదియుఁ గాక. ద్వేషోచ్చాటన మారణాది కుహకాన్వితంబు మంత్ర ప్రపంచంబు. చిత్రాసన బంధకరణ ప్రాయాసాస్పదంబైన యజ్ఞాన భావంబున హఠంబు దేహపద నాడీవ డాధార చేతో

భ్రమంబు ధ్యానం బిట్లు గావున మనోవిగచితంబైన తన్నకలంబును
బరిత్యజించి యమనస్కంబు భజింపు మని శివుండాన తిచ్చిన న
మ్ముని వరుండు. ౧౨౫

తా. మఱియు- మంత్రయోగము విచారించినచో; ఉచ్చాటనము- మారణము మొ
దలగు క్రూరకృత్యంబుల కాలయమై యున్నది. హఠయోగము విచారింతుమేని, ఆసనము
లు- బంధములు- వేయుట యందు మహాశ్రమ ననుభవించ వలయును. ఆధారాది ష
ట్చక్రముల చేతో భ్రాంతితోఁ గూడి యుండునది ధ్యానము. కాబట్టి మనస్సుచే నేర్ప
రపఁ బడుచున్న సర్వంబును విడిచి యమనస్కము నాశ్రయింపుము. అని శివుండు వచిం
ప మునీంద్రు డిట్లనియె.

—* వామదేవ మహర్షి శివుని ధ్యానించి యమనస్కమును గూర్చి
చెప్పఁ బ్రార్థించుట. *—

తే. గీ. దేవదేవేశ కరుణావి ధేయ యాభవ
పరసదానంద కారక భగవదాఖ్య
సర్వభరిత యపార సంసార ఘోర
విమథ తారక విశ్వేశ విష్ణువినుత. ౧౨౬

తా. ఓమహాదేవ! ఓవిశ్వేశ! విష్ణ్వాది దేవతలచేఁ గొనియాడఁ బడినో మహా
నుభావా? సంసార సాగరమునుండి తరింపఁజేయు మహాత్మా?

* నిరోష్ఠ్య కందము *

క. ధరణీధర తనయానన
సరసిజ ఖరకిరణ శరణ జనల సదంతః
కరణజల జాతచలితష
ట్చరణీకృతచరణ! హస్త సంగత హరిణా. ౧౨౭

తా. ఓపార్వతీ పతీ? ఓభక్త హృదయ కమల నివాసా? ఓమృగాంకధరా?
లయగ్రాహి.

ఇంచుఁడును భానుఁడు నందగిన కందువల

యందుగల తారకము । లందు భవదీయా
నందమయ భవ్యరుచి । గ్రందుకొని దేహులకు
ముందటను జూడఁ జెలు । వొందు జలమధ్యం
బందునవి చంచలత । నందమగు జ్యోతిగర
ణిందనరిమించి వెలుఁ । గొందు నటకాదే
యందునిజ వర్తనము । లందు మిగులంగ దెలి
వందుట మహాద్భుతని । బంధమిది రుద్రా. ౧౭

తా. ఓశంకరా? భక్తవశంకరా? చంద్రసూర్యులని ప్రసిద్ధిగనిన- కందోయి యందుగల నల్లగ్రుడ్లు యందు- మహాతేజోవంతమై ప్రకాశించు కాంతినీ యనియే గదా! జలమధ్యంబునఁ బ్రజ్వరిల్లు తేజస్సువలె విలసిల్లుచున్న నీజ్ఞానతేజస్సు చేత నే గదా? ప్రపంచం బంతయు- స్వకార్యములందు జాగరూకత గలిగి ప్రకాశించునది.

సీ. నీప్రసాదంబున । తెలుపంబ పూర్వయో
గము సవిస్తరముగఁ । గలిగె నాకు
భవదుక్తమైనయ । పరయోగ మింక నె
య్యది దానినానతి । మ్మనిన నతని
కంగజారాతి యు । ట్లను బహిర్ముద్రాంకి
తంబయ్యె పూర్వంబు । తన్మనము బ
హిర్యోగమగు ముదం । బెసఁగ నంతర్ముద్ర
యను పేర నభినుతం । బయ్యె నపర
తే. గీ. మదియకాదె యంతర్యోగ । మదియ రాజ
యోగమని చెప్పఁబడు సర్వ । యోగములకు
రాజగుటఁ జేసి దానికి । రాజయోగ
మనెడి విఖ్యాతి గలిగె స । న్మునివరేణ్య. ౧౮

తా. కావునఁనో మహాత్మా? నీయనుగ్రహంబున నాకుఁ బూర్వయోగమని ప్రసిద్ధి నొందిన తారకయోగము దెలిసినది. అపరయోగమగు నమస్కము నాకు వచింపుము' అని ప్రార్థింప, వామదేవ మునీంద్రా? బహిర్ముద్రలతోఁ గూడికొనిన దగుటచేఁ తారకం

బు పూర్వంబునాఁ బరఁగు. బహిర్యోగమనియు వచింపఁబడు. అంతర్ముద్రతోఁ గూడి కొని సదియగుటచేసమనస్కము- అంతర్ముద్రి యనియు- అంతర్యోగ మనియుఁజెప్పంబ డు. సమస్త యోగములకు రాజగుట వలన నియ్యది రాజయోగమని పేర్కొనఁబడును.

— * శివుండు- వామదేవ మహర్షికి సవిశేషముగాఁ దారకామనస్క ము లుపదేశించుట. * —

వ. మఱియు నయ్యోగంబు రాజనంబరఁగి దివ్యంబగుచునానందప్రద మై యవ్యయంబైన పరబ్రహ్మంబునందు నైక్యం బగునట్లుగా దే హిం బొందించుగావున రాజయోగంబనండగు. రాజయోగమాహా త్మ్యంబు నిశ్చయంబుగా నెవ్వం డెఱుంగు, నతనికిసద్గురువాక్యంబు న నదిసిద్ధించు. తదీయ జ్ఞాన మాత్రంబున ముక్తియగును. అందు సుస్థిరతగలిగిన సిద్ధియగును. అపుడుచెప్పిన యంతర్యోగ బహిర్యో గంబులు సవిశేషంబుగా నెఱింగిన యతండు గృతార్థుండు. ౧౩౦

తా. ఈయోగము మానవుని నానంద ప్రదంబైన యద్వితీయ పరబ్రహ్మము నందై క్యంబు నొందించుట చేసను- దక్కిన విటుల నైక్యము నొందింప నసమర్థము లగుటచేత ను- రాజయోగంబను పేరు దీనికి రూఢి యయ్యెను. సద్గురు ప్రసాదంబున రాజయోగం బు మానవుల కలవడు. దాని తెలిసినంత మాత్రంబుననే ముక్తి నొందుదురు. దానియందు స్థిరత్వము గుదిరినచోఁ గార్యసిద్ధి త్వరలో గలుగును. ఎవఁడీ తారకా మనస్కములను సవిశేషంబుగా డెలిసికొనునో వాఁడే లోకంబునఁ గృతార్థుండని చెప్పఁ బడును.

క. అతఁడు నాచేతను నీ
చేతను వంద్యుఁడగునని వి॰ శేషించిన వి
ఖ్యాతాత్ములచే వంద్యుం
డైతనరును జెప్పనేల ॰ యమల విచారా! ౧౩౧

తా. ఓతాప సోత్తమా? అట్టి వాఁడు నీకును నాకును నమస్కరింపఁ దగినవా డని చెప్పినచో నితరులమాట లెక్కేమి?

తే. గీ. ఋత్విజులు చిత్తబుధ్యహం ॰ కృతుగాఁగలు

మానసము సోమపాన స మ్మదముఁ బొంద
విను డశేంద్రియ ప్రాణాల వేల్పఁగా న
లయును యోగిజ్యోతి ర్మండ లంబు సంపు. ౧౩౨

తా. యోగీశ్వరుఁడు యాగము చేయనిశ్చయించిజ్యోతిర్మండలమునందు—చిత్తము. బుద్ధి- అహంకారము- బుత్విక్కులుగాను, మనస్సు సోమపానము గాను, కర్మేంద్రియము లైదును- జ్ఞానేంద్రియము లైదును గలసి పదియింద్రియములను బ్రాణ మును వపగా వేల్వలయును.

తే. గీ. ఒప్పలరఁ దాలుమూల రం ధ్రోపరిస్థ
లముల నడుమ జ్యోతిర్మండ లంబు వెలుఁగు
సాతతము నది యోగీంద్ర జనులచేత
ధ్యేయ మణిమాది సకల సి ద్ధి ప్రదంబు ౧౩౩

తా. దవడలయొక్క మొదటి ప్రదేశమందుగల రంధ్రమునకు పైభాగము మధ్య యందు వ్రేలాడుచు జ్యోతిర్మండలము ప్రకాశించును. యోగీంద్రు లందఱు దానిని యుపాసించు చుందురు. అణిమాద్యష్టైశ్వర్యముల నదియే యొసంగును.

తే. గీ. వేదములు శాస్త్రములు బహు విధ పురాణ
ములును నసమాన గణికలను బోలెనుండు
శాంకరీవిద్య యొకటి యీ జగతిలోన
గుప్తమై కులస్త్రీవోలెఁ గొమరు మిగులు. ౧౩౪

తా. సమస్త వేదశాస్త్రములేమి? పురాణములేమి? వేశ్యలవంటివి. అనఁగా నెవరు గ్రహించిన వారికిఁ జిక్కుచుండును గాని, శాంకరీ విద్యయొకటి మాత్రము కులసతివలెఁ దనస్వాధీనమున నుండును.

—* శాంభవీ ముద్రాలక్షణము. *—

క. కనుఁగొన నంతర్లక్ష్యం
బును దృష్టి వెలిన్ని మేష ముును నున్మేషం
బును లేకుండుట నదియో
వినుతింపఁగఁదగిన శాంభ వీ ముద్రయగుఁగా. ౧౩౫

తా. అంతర్లక్ష్యమును గాంచుచు— నిమేషోన్మేషములులేని దృష్టిగలిగి యుండుటయే శాంభవీ ముద్రయని వచింపఁబడినది.

—*శివవిద్యా ప్రాశస్త్యము*—

ఉ/అరయ సర్వతంత్రముల । యందును గోపితమైన దీని మున్
గౌరియెఱిఁగె నావలనఁ । గౌతుకమారఁగ నీవుజన్మ సం
స్కారముమై నెఱింగితివి । సయ్యన నిప్పుడు సంయమీంద్ర ! వి
స్తార భవాబ్ధి వేలయగుఁ । దప్పక యీశివవిద్య హృద్యమై. ౧౩౭

తా. సర్వతంత్రములందును రహస్యమై వెలయుచున్న యీముద్రను మొట్టమొదట పార్వతి నావలన దెలిసికొనినది సుకృత విశేషంబున నావలన నీవిప్పుడు దెలిసికొంటివి. మునీంద్రా! ఈశివవిద్య సంసార సాగరమునకుఁ జెలియలికట్టవంటిది సుమీ.

సీ. అదియునుగాక గు । హ్యము నతిగుహ్యము
నైన యివ్విద్య యె । వ్వానికైన
నీఁదగ దెచ్చోట । నిది యెఱిఁగిన చాలు
ధీమంతుఁడగును నా । దేశమెల్లఁ
బుణ్యభాజనమట్టి । పూతాత్ము దర్శించి
నను నర్చన మొనర్చు । నట్రిసప్త
కులయుక్తులైన వా । రలు ముక్తిపదమును
బొందుదురనినఁ బ్ర । స్ఫురిత మహిమఁ

తే. గీ. దత్పరాయణు లగువారు । ధన్యులగుట
వేఱె చెప్పఁగనేల? యు । ర్వీస్థలమునఁ
జిత్రముగ ననుసంధాన । మాత్రముననె
సిద్ధిదాయక మీయోగ । మిద్ధచరిత.! ౧౩౮

తా. మిక్కిలి రహస్యమగు నీవిద్య యెవ్వానికిఁ జెప్పఁదగదు. దీనిని దెలిసికొనినచో నతఁడు ధీమంతుఁడగును. అట్టి మహాత్ముఁడుగల దేశము పుణ్యవంతమగును. వానిని జూచిన వారుధన్యాత్ములు. తలచినంత మాత్రమున నీయోగము కార్యసిద్ధులు జేయును.

క. ఏవివరించిన భంగిన
యీవరయోగి ప్రకార । మెవ్వఁడు సాధి

త్రాపవీణ్యంబున నెఱుఁగుఁ
జీవన్ముక్తుఁడగు నతఁడు శ సిద్ధగంబనఘా. ౧౩౮

తా. ఓమహర్షీ! నేను జెప్పిన విధమున నెవఁడీ యోగమును జ్ఞానసై పుణ్య
న నెఱుంగునో, అతఁడు జీవన్ముక్తుఁడగును.

క. పూర్వాపర యోగజ్ఞుఁడు
పూర్వాపర రహితుఁడగుచు శ బుధవంద్యుఁడగుం
బూర్వాపర హీనుండును
బూర్వపదం బాశ్రయించుఁ శ బురుషవరేణ్యా! ౧౩౯

తా. పూర్వాపరములగు తారకా మనస్కముల నెఱింగినచో, జ్ఞాని యగు
జేత నాతని నెల్లరు నమస్కరింతురు. తారకా మనస్కముల నెఱుంగని వాఁడు జన్మ
ములనే యెత్తుచుండును కావున నట్టి తారకయోగ మభ్యసింపుము.

తే. గీ. ఊర్ధ్వదృష్టి యధోదృష్టి శ యూర్ధ్వవేద్య
మటనధః పుర మొంతయు శ నలవడంగ
సమ్మదమున రాధాయంత్ర శ సువిధానఁ
గౌశలమున జీవన్ముక్తి శ గలుగుచుండు. ౧౪౦

తా. ఊర్ధ్వ దృష్టియు- అధోదృష్టియు, ఊర్ధ్వ వయపక్షజ్ఞానము, అధోవయపక్ష
జ్ఞానమును గలవడినమాను వునకి రాధాయంత్రమున లెజీవన్ముక్తి గలుగును.

క. కులమును నాచారంబును
గలగురువులు తెలియఁగలరు శ గానిమునీంద్రా
కులమును నాచారంబును
దొలఁగిన గురుఁ డొక్కఁడైన శ దుర్లభ మనఘా. ౧౪౧

తా. కులము- ఆచారముగల గురువు లనేకులు గన్పింతురు గాని, కులాచారము
విడిచిన గురువులు దుర్లభులు. అనఁగాఁ గులాచారము లున్నను- అత్మయందుఁ గులాచా
ర భ్రాంతిఁ విడిచి జ్ఞానము కలిగియున్న మహాత్ముఁడే గురుపదమున కర్హుఁడు.

క. బనరగ ఫలంబు పుష్పం
బునన ప్రకాశించి పుష్ప శ మును జెలువ విధం

బును దత్త్వంబును దేహం
బునన బ్రకాశించి దేహ । మున్నాసఁ జేయు నర్కా. ౧౪౨

తా. పుష్పమున ఫలంబు పుట్టి తిరిగి యది యాపుష్పమునే నశింపఁ జేయునట్లు దేహమందుండిన తత్త్వము దేహమునే నశింపఁ జేయును.

క. ఒండేల తత్త్వమాత్మస
యుండ నెఱుఁగలేక మూఢుఁ । డొగి శాస్త్రభ్రాం
తుండగును మేఁకచంకస
యుండఁగ మత్తిల్లైన గొల్లఁ । డుఱుకఁడె నూతన్. ౧౪౩

తా. గొల్లవాఁడు మేకను జంకనే యుంచికొని, నూతిలోఁ బడెనని యుఱుకు చందమున మూర్ఖులు తమలోనున్న తత్త్వము గుర్తెఱుఁగ నేరక శాస్త్రములందు భ్రాంతి గలిగి సంచరింతురు.

—* వామదేవుఁడు శివుని వలన రాజయోగము విని
జీవన్ముక్తుఁడగుట. *—

క. అని వామదేవునకు నె
మ్మనమారఁగ రాజయోగ । మార్గము కరుణా
వనధియగుచు నానతి యి
చ్చెను సద్భక్తప్రియుండు । శివుఁడిబ్భంగిన్. ౧౪౪

తా. భక్తపరాధీనుఁడగు శంకరుఁడు వామదేవమునికి నీరీతిగ రాజయోగ మార్గమును వచించెను.

క. అతుల శివభక్తి నిష్ఠా
యుతుఁ డమ్ముని వరుఁడు రాజ । యోగానంద
స్థితసచ్ఛలాత్ముఁడై యా
ర్జిత జీవన్ముక్తుఁడై ప్ర । సిద్ధుండయ్యెన్. ౧౪౫

తా. మహాదేవుఁడగు శివునియందు భక్తి గలిగిన యమ్మునీంద్రుఁడు రాజయోగానందని మగ్నుఁడై జీవన్ముక్తి నొందెను.

క. కావున ముముక్షువులు స
ద్భావంబున రాజయోగ ♦ బలమున నుండం
గావలయు నందు సుస్థిరు
లౌవారి కసాధ్య మెద్ది ♦ యైనను గలదే. ౧౪౫

తా. రాజయోగ మార్గమున స్థిరత్వము గలిగియున్న ముముక్షువులకు సాధ్యము కానిది యెద్దియును లేదు.

—* లింగార్చనమే రాజయోగము *—

వ. రాజయోగంబు లింగార్చనంబని యు నీశ్వరోక్తం బయ్యె, న ట్టిలింగంబు. ౧౪౬

తా. లింగార్చనమే రాజయోగమని కూడ బరమేశ్వరుడు వచించెను.

ఆ. వె. ఆత్మలింగమన స ♦ హజలింగమన దివ్య
లింగమనఁగ బ్రహ్మ ♦ లింగమనఁగ
సిద్ధలింగమనఁగ ♦ శివలింగమన మహా
లింగమనఁగ సహజ ♦ లీలవెలయు. ౧౪౭

తా. లింగము— ఆత్మలింగమనియు సహజలింగమనియు, దివ్యలింగమనియు, బ్రహ్మలింగమనియు, సిద్ధలింగమనియు, శివలింగమనియు, మహాలింగమనియును వచింపఁ బడును.

ఆ. వె. స్వర్గనరకగతుల ♦ సరిసుఖ దుఃఖంబు
లెన్నియనుభవింపఁ ♦ డిటకమనుపు
మనుజుఁ డింకముక్తి ♦ మార్గంబు వలసిన
సిద్ధలింగపూజ ♦ సేయ వలయు. ౧౪౮

తా. స్వర్గ నరకములలోఁ దుల్యమగు సుఖదుఃఖము లెన్నియు ననుభవింప నిచ్ఛ ను వదిలి, ముక్తిమార్గమునే కోరెడి మానవులు సిద్ధలింగ పూజఁ జేయవలయును.

క. ఏమటిక యీభవమున స
దా ముక్తి ♦ నుత్సహింపఁ ♦ దలపండఁట వే

యేమిఁక నొక్క భవమున
నీమేలొనగూడ నేర్చు ? నే జనులకిలన్. ౧౫౦

తా. ఈ జన్మయందు ముక్తి నొందఁ బ్రయత్నింపనిచో దిరిగి వచ్చు జన్మమందు మానవుఁడు ముక్తి నొంద నేరడు.

క. కావున జన్మము సఫలము
గావేగమ మనుజుఁడాత్మ కర్మఫలేచ్ఛం
బోవిడిచి లింగపూజా
ప్రావీణ్యుండగుచు ముక్తిఁ బడయుట యొప్పున్. ౧౫౧

తా. కాఁబట్టి మానవు లాత్మకర్మ ఫలము ని యనుభవించుచు - లింగపూజ నాచరించి ముక్తి నొందవలెను.

—* లింగ మహిమ. * —

సీ. లింగమహాత్త్వంబు భంగియెట్లనిన లిం
గము మృచ్ఛిలా కాష్ఠ కనక రజత
కాంస్యతామ్రాదుల ఘనమౌక్తిక స్ఫటి
కాదులఁ జిత్రిర త్నాదిభేద
ముల నితగులు మిత ముగఁ జేయ రదియుఁబా
షాణ వృష్టిఁ గులి శమ్ములు వసిన
నొక్కించయును భిన్న మెక్కుడయును గాదు
మఱియగ్నిచే నైన మండఁ బడదు

తే. గీ. గాలిచేదూల దఁట మునుఁ గదు జలములఁ
దప్పియును బోదు భూపతి తంబుగాదు
తస్కరుల చేతఁ బడదు య ధార్థమెందు
లేదుపద్రవ మమ్మహా లింగమునకు. ౧౫౨

తా. లింగమహిమ యనంతము. మృణ్మయ లింగము - శిలాలింగము, సువర్ణ లింగము, కాష్ఠలింగము కాంస్యలింగము - తామ్రలింగము - మౌక్తిక లింగము, స్ఫటిక లింగము, నవరత్న లింగములు, మొదలగు ననేక విధముల శివలింగములు పూజింపఁ బనువ

స్థి. మహాలింగ మేదిగలవో, అదిరాళ్లుపడి నను మొక్కపోగు. అగ్నిచే మండిపోదు. గాలిచేఁ గొట్టుకొని బోదు జలములో గలియదు, తస్కరులచే హరింపఁ బడదు. నిజముగా నామహాలింగమున కెప్పుడును బాధలేదు.

క. కాదగ్నిజంబు వారము
గాదారయు సైంధవంబు ♦ గాదదిరూపం
బేదియును గాదు లింగం
బాదియు నంత్యంబు లేని ♦ యధికత నుండున్. ౧౫౩

తా. ఆమహాలింగము- అగ్నిలోఁ బుట్టినది గాని, ఉదకమందు జనించినది గాని, సైంధవము గాని కాదు. దానికి రూపములేదు. ఆద్యంతములు లేవు.

చ. అజ వనజోదరాదులకు ♦ నందఁగరానిది లింగమూర్తి వా
గ్వ్రజమునకున్ మనంబునకు ♦ వశ్యముగానిది లింగరూప మ
క్కజముగ నద్వయంబు నవి ♦ కారమునైనది లింగమక్షయం
బజమవలంబ శూన్యము ని ♦ రామయమైనది లింగమెల్లెడన్.

తా. బ్రహ్మవిష్ణ్వాదులాలింగమును గనుగొన నేరక పోయిరి. వాక్కునకు- మనస్సునకు నది యందనిది- ఏకమై- అవికారమై- ఆధార శూన్యమై నాశరహితమై యది సమస్తమున నిండియున్నది.

క. పరమామృత స్వరూపముఁ
బరమానంద ప్రభవంబుఁ ♦ బరమ పదంబుం
బరమ పవిత్రంబును నై
పరఁగున్ లింగంబు సర్వ ♦ పరిపూర్ణంబై. ౧౫౫

తా. అమృత స్వరూపమై సర్వంబునఁ బరిపూర్ణమై పవిత్రమై పరమోత్తమ స్థానము నొసంగు నామహాలింగము ధ్యానించి నంతనే యత్యంతా నందమొసంగును.

క. పరతత్త్వం బాలింగము
పరమాత్మ యనంగ నదియ ♦ బ్రహ్మమదియ సు
స్థిరమును నిత్యము సత్యము
నిరుపమమును నిష్కళంబు ♦ నెఱిసదియ కదా. ౧౫౬

తా. ఆమహాలింగమే పరతత్వము- బ్రహ్మము- పరమాత్మ సత్యము, నిష్కళము ననునామంబులచేఁ బేర్కొనఁ బడుచుండును.

క. సదమల మతికిని లింగం
బిదిగోనని గురువరేణ్యుఁ ॥ డెంతయు గరుణా
స్పదుఁడై తెలిపిన మోదము
గదురఁగ నది బట్టబయలు ॥ గా నతఁడెఱుఁగున్. ౧౧౭

తా. సద్గురువు, నిర్మలబుద్ధిగల శిష్యునికిఁ గరుణామయుఁడై ఇదిగో మహాలింగమిట్టిదని తెలిపినచో, నాతఁడు మహానందము నొంది, బట్టబయలుగా దానిని దెలిసికొనఁ గలఁడు.

తే. గీ ఎఱిగినంతట మదిలోన ॥ నెల్ల సంశ
యములుఁ బాయంగ నఖిలంబు ॥ నాత్మలింగ
మయమయని నిర్ణయించి య ॥ మ్మహితచరితుఁ
డురుచిదానంద విశ్రాంతి ॥ నొందుచుండు. ౧౧౮

తా. గురువు వలన బట్టబయలై యున్న యా మహాలింగమును దెలిసి నంతనే, యనేకసంశయములు దీరును. ఎల్లప్పుడు చిదానందము ననుభవించుచు, నాతఁడు, తన్మయుఁడై యుండును.

క. లింగము నడుమనయుండున్
సంగతి వెలయంగ నోలి ॥ సర్వజగంబుల్
లింగమునకు వెలయని చె
ప్పంగలదేమియును లేదు ॥ భావింపంగన్.

తా. "లింగమధ్యే జగత్సర్వం" అనుసూక్తి చొప్పున సర్వము లింగమధ్యమునందే గలదుగాని, లింగమునకు వెలుపల నేమియును లేదు.

౧౨౦

వ అదియునుంగాక.

తా. మఱియు.

తే. గీ ఉమకు సర్వాగమము భవుం ॥ డుత్తరంబు
నందు "లీనంచరాచరం ॥ యత్ర" యనియు

ను సరగా "సుఖాంతంలిం । ముచ్యతే" య
నియుచు వివరించె శివలింగ । నిశ్చయంబు. ౧౬

తా. " లీయతే గమ్యతే యత్రియేన సర్వం చరాచరం తదేతల్లింగ మిత్యుక్తం లింగతత్వ పరాయణైః " "లీనం చరాచరం యత్ర " సుఖాంతం లింగముచ్యతే" అను ప్రమాణముల ననేకంబుల శివుండు పార్వతికి సర్వాగ మోత్తరంబు లందు వచించెను.

క. అందలి యర్థం బెట్లం
టం దక్కక సుఖవంశంబు । నగ లీనంబౌ
నంమఁ జరాచర మింతయు
నందము గానిదియ లింగ । మని చెప్పఁదగున్. ౧౭

తా. ఆయాగమముల తాత్పర్యమేమి యనఁగా, లింగమునందే సర్వంబును లీనమగును గాన, నీసర్వంబును శివరూపమేయని వచింపఁ బడినది.

సీ. అనలంబు కాష్ఠము । నందు నున్నట్లు
తిలలలోఁ దైలంబు । నిలిచినట్లు
చెఱకున మధురవి । శేషమున్నట్లు మ
హాలింగ మఖిలంబు । నందు నెపుడు
నతిసూక్ష్మమై గూఢ । స్థితియుండు మఱియుఁ బు
ష్పంబు నందుఁ బరిమళంబు వోలె
లింగంబు సమరస । లీల విశ్వంబున
నుండును శబ్దవా । యువులు నభము
ఆ. వె. నందుఁ గలసియున్న । చందంబు ననసర్వ
మునను సహజ లింగ । మూర్తియుంట
నిశ్చయంబు గాని । నిజముంగఁ దన్నిజా
కారగౌరవంబు । గావఁ బడదు. ౧౮

తా. కొయ్యలో నగ్నియు, నువ్వులందు నూనెయు, చెఱుకు గడయందు తీపియు నున్నటుల, నా మహాలింగము నంతె సూక్ష్మమై, గూఢమై సర్వంబు నందును పుష్పములు పూలయందును, శబ్దవాయువు లాకాశమందును నున్న విధమున లింగము విశ్వమున నున్నది ఇదియె నిశ్చయము. ఆమహా లింగా కారము సాధారణము గాదృగ్గోచరము కాదు.

తే. గీ. అట్లమైనను దగిన ప్రి । యత్న మొప్పఁ
బాలనడఁగిన ఘృతము ద । ప్పక మథింప
విశదమాభాతి నభ్యాస । నిధికతమున
నట్టిలింగంబు సువ్యక్త । మై వెలుఁగు ౧౬౪

తా. పాలను మథించినచో నేయి వచ్చినటుల, నభ్యాస వశమునఁ దగిన ప్రయత్నము చేసిన నా సహజ లింగము గోచరించును.

వ. అభ్యాసంబు నన కాదె సర్వవిద్యలును సిద్ధించు నెవ్వరికైన నవి యూరక సిద్ధింప నేర్చునే,యాత్మలింగ దర్శనంబునుంబూర్వోక్త శాంభవీ ముద్రాభ్యాసంబున సిద్ధించుం గావున. ౧౬౫

తా. సమస్త విద్యలు నిత్యము నభ్యసించుటచేత నెటుల వచ్చుచున్నవో, అటులే యాత్మలింగ దర్శనమును శాంభవీ ముద్రచేఁ గలుగును.

ఆ. వె. రాజయోగ విధిని । రమణీయ శాంభవీ
ముద్ర గురుముఖమున । మొదల నెఱిఁగి
యాత్మ లింగమూర్తి । నలరి యంతర్లక్ష్య
మున భజింప వలయు । ననఘ మతులు. ౧౬౬

తా. రాజయోగ మార్గము నవలంబించి గురువు వలన శాంభవీ ముద్ర గుర్తెఱింగి యంతర్లక్ష్యమున నాత్మలింగమును సేవింపఁ వలయును.

## —* అంతర్లక్ష్య లక్షణము. *—

వ. శాంభవీ ముద్ర యనందగిన యంతర్లక్ష్య లక్షణం బెట్టి దనిన.

తా. శాంభవీ ముద్రాలక్షణమును వచించెద.

క. వెలుపలయును లోపలయును
వెలిగాఁ దన్మధ్య మాముల । వెలుఁగుచు మొదలం
బొలుఁ డగు నాశోజ్యోతి
స్థల మంతర్లక్ష్య మదిగ । దా గోప్యమగుఁగా. ౧౬౭

సీ. అక్కడఁగాదె బాహ్యాంతరంబుల నడు
మగుట నంతర్లక్ష్య మైతనర్చు
నచ్చోటఁగాదె యీ యఖిల జగద్విలీ
నస్థలంబ సదృశానంద కేళి
యయ్యెడఁగాదె పెక్కైన యెఱుకలకుఁ
గారణంబై యుండు గరిమ మెఱయ
నాతావు గాదె నిరంతర శోభితం
బగు నాదబిందు కళాశ్రయంబు
తే. గీ. సగుణ నిర్గుణ కలితమై నెగడు నదియ
పరమ నిర్మల రూపమై పరఁగు నదియ
నిజనివాస విలాసమై నెరయు నదియ
మెలమిఁ గన్నుల పండువై వెలయు నదియ. ౧౭౭

తా. ఏది బాహ్యాంతరముల మధ్యమనియు- నంతర్లక్ష్య మనియు- జగత్తు నశించు స్థానమనియు- పరమానంద స్థానమనియు- నాదబిందు కళాశ్రయమనియు- సగుణ నిర్గుణ స్వరూపమనియు- సర్వంబునకుఁ గారణమనియు వచింపఁబడుచున్నదో, అది యీ శివలింగనివాసస్థలంబేకదా?

శా. సేమం బారఁగ నగ్నిబింబ మచటం । జెన్నొందు నూహింపఁగా
నామధ్యంబున సూర్యబింబము దిరం । బైయుండు వీక్షింపఁగా
నామధ్యంబునఁ జంద్రబింబము మలం । బై యుండుఁ భావింపఁగా
నామధ్యంబున నంకురం బొక్కటి భ । వ్యాకారమై చెల్వగున్.

తా. సకలక్షేమంబుల కాలయంబగు నగ్నిబింబ మచటే ప్రకాశించును. తన్మధ్యమందే సూర్యబింబము విలసిల్లును. దానిమధ్యమునఁ జంద్రబింబమును- అందు సుందర మగు నంకురంబును నొప్పుచుండును.

క. అదిబీజము సర్వమునకు
నది యమృత పదంబు నిశ్చ । లానంద కరం
బది సంస్తుత తేజోమయ
మది శివలింగ స్వరూప । మదియ తలంపన్. ౧౭౯

తా. ఆబీజమే సర్వంబునకుఁ గారణంబై- యమృత ప్రదమై-తేజోమయమై శివ లింగమై మహానందము గలిగించు చుండును.

—* శివలింగమహిమ *—

క. ఆదంద సకల సృష్టియు
నంద ప్రవర్తించునా స కే హాజలింగము సొం
పొందఁగ నాహాజ్యోతి గ
తిం దనరునుకోన వెలిన కే తిస్ఫుటలీలన్. ౧౮౦

తా. సకల సృష్టి యందును బ్రకాశించు నాశివలింగము వెలుపలను నాహాజ్యోతి రూపై వెలుంగు చుండును. ౧౮౧

వ. మెడియు.

తా. మతియు.

క. సురుచిర పీఠాగ్ర ఘటిత
హరినీలద్యుతి విధమున కే నభినవ శోభా
కరమైన దివ్యలింగ
స్ఫురణము గర మొప్పు నాత్మఁ కే జూడఁగ నెపుడున్. ౧౮౨

తా. పీఠముయొక్క యగ్రభాగంబున మెరయు నింద్రనీలమణి కాంతి మాడ్కిన వీన కాంతుల వెల్గుచున్న దివ్య లింగమును నాత్మయం దెల్లపుడును జూచు చుండ వలయును.

సీ. అదియాల వేదోక్తు కే లరయంగ నల్లని
మేఘంబు లోనుండు కే మెఱుపుఁబోలె
శోభిల్లి నీవార కే శూకంబు పగిది స
న్నంబయి పీతవ కే ర్ణంబుతోడ
నణుతుల్యమై చెలు కే వారుఁ బావకశిఖ
యా మధ్యమునఁ బర కే మాత్మ యుండు
నదిబ్రహ్మ యదివిష్ణుఁ కే డది శివుండది యింద్రుఁ
డది యక్షరంబగు కే నదియ పరమ

తే. గీ. మదిస్వశాఖ్యాన నిబ్భంగి । విదితమైన
యాత్మలింగంబు నెఱుఁగుమీ । రమర జనులు
మఱియు వేదంబులును భక్తి । మెఱయ వినుతి
పూర్వకంబుగ శివలింగ । మునకు మ్రొక్కు. ౧౮౩

తా. నీలమేఘ మందలి మెఱుపుతీవవలె మిగుల సన్నమై పీత వర్ణము గలిగి యగ్ని జ్వాలా మధ్యంబునఁ బ్రకాశించు నాపరమాత్మయే- బ్రహ్మయనియు- విష్ణువనియు- శివుఁడనియు- ఇంద్రుఁ డనియు- అక్షరుఁడనియు- పరమనియు- స్వరాట్టనియు- ఆత్మలింగ మనియు వచింపఁ బడుచుండు నని వేదములు వచింపు చుండ లేదా? వచించుటయు గాక, యావేదంబులు శివునికి భక్తితో మ్రొక్కు చుండును.

—* శాంభవీ ముద్రయే లక్ష్యాను భవమునకు హేతువు. *—

మ. శివలింగంబుయమీంద్ర బృందహృదయ । స్నిగ్ధాబ్జభృంగంబు దు
ష్కృత సంఘాత సమస్త దోషపటలీ । భంగంబు వేదాంత శా
స్త్ర విశుద్ధ ప్రకటీకృతాద్వయముల స । త్సంవిత్స్వ రూపంబు చి
త్రవిధోద్యత్స చరాచరాత్మక జగ । ద్రంగంబు భావింపఁగన్.

తా. సమస్త మునీంద్రులచే దమహృదయ కమలంబు లను పాసింపఁ బడుచు- సర్వ దోషంబుల నశింపఁ జేయుచు- వేదాంత శాస్త్రంబులచేఁ బ్రకటింపఁ బడిన జ్ఞానస్వరూపము గుచు- చరాచరాత్మకమై ప్రకాశించు నాశివలింగ మహిమంబెవరు వచింపఁగలరు

తే. గీ. ఇట్టి శివలింగమును గన । హేతువనఁగఁ
బరఁగు శాంభవీముద్రయ । పారభద్ర
పటుచిదగ్ని శుష్కీకృత । భవసముద్ర
సదమ లానంద కల్పిత । జాడ్యనిద్ర ౧౮౪

తా. ఈమహా శివలింగమును గనుగొనుటకు- చిదగ్నిచే నెండింపఁ జేయబడిన సంసార సముద్రము గలిగి- ఆనంద మొసంగుచు- అనంత శుభంబుల నొసంగు శాంభవీముద్రయే కారణము

సీ. సంయమి వర్యులా । శాంభవీ ముద్రా వి
ధానంబుఁ గడువిశ । దంబు గాఁగ

సెలుఁగంగ వలయున । దెట్లన్నఁ బ్రతిపదా
ఖ్యయు నమావాస్యయు । నవలఁ బౌర్ణ
మాసియునని కథిం । పందగు సంజ్ఞలు
గలదృష్టు మూఁడయ్యెఁ । గ్రమము తోడ
నొగిఁ బ్రతిపచ్చక్షు । వున్మేషమాత్రలో
చనము లమావాస్య । జగతిఁ బౌర్ణ

తే. గీ. మాసియర్ధావలోకన । మార్గమయ్యె
మూఁడు చూపుల యందును । మొదటి రెండు
నప్రయోజనములు గాన । యవి పరిత్య
జించి మూఁడవ చూప భ్యసించు టొప్పు ౧౮౬

తా. మునీంద్రులారా! శాంభవీముద్రా విధానము దెలిసికొన వలయును ఇయ్యది ప్రతిపత్తనియు- అమావాస్య యనియు- పౌర్ణిమయనియు- మూడువిధములు- నేత్రములు బాగుగాఁదెరచియుండుట ప్రతిపత్తనియు- సంపూర్ణముగ మూసికొనుట యమావాస్యయనియు- అర్ధావలోకనము, పౌర్ణమాసి యని జెప్పబడును. ప్రతి పదమావాస్య దృష్టులవలనఁ బ్రయోజన మిసుమంతయు లేదు గాన, ఆమూడవది యగు నర్ధావలోకమే యభ్యసింపఁదగినది.

క. నాసాగ్ర దత్తదృష్టియ
యీ సమ్యగ్దృష్టి యగుట । నెఱిఁగి తదీయా
భ్యాసము తరముగఁ జేసిన
యాసుమతికి సాధ్యమెద్ది । యైనను గలదే. ౧౮౭

తా. ఈదృష్టియే, నాసాగ్ర దృష్టియగును. కావున నీదృష్టిని భ్యాసము చేసిన ధీమంతునికి జగంబున సాధ్యమేదియు లేదు.

సీ. పూర్ణిమా దృష్టినే । పూనసల్పి తోడన
తారక యోగావ । ధానమమర
న చలిత స్థితనుండు । నతనికిఁ దాలుమూ
లద్వార శాంతి । స్థానంబు నడుము
దడయక మెవరునఁ । బొడగానవచ్చును

సీ. అక్కడఁగాదె బా । హ్యాంత రంబుల నడు
మగుట నంతర్లక్ష్య । మైత నర్చు
నచ్చోటగాదె యీ । యఖిల జగద్వి లీ
నస్థలంబ సదృశా । నంద కేళి
యయ్యెడగాదె పె । క్కైన యెఱుకలకుఁ
గారణంబై యుండు । గరిమ మెఱయ
నాఠావు గాదె ని । రంతర శోభితం
బగు నాదబిందు క । ళాశ్రయంబు

తే. గీ. సగుణ నిర్గుణ కలితమై । నెగడు నదియ
పరమ నిర్మల రూపమై । పరఁగు నదియ
నిజనివాస విలాసమై । నెరయు నదియ
యెలమిఁ గన్నుల పండువై । వెలయు నదియ. ౧౭౭

తా. ఏది బాహ్యాంతరముల మధ్యమనియు- నంతర్లక్ష్య మనియు- జగత్తు నశించుటకు స్థానమనియు- పరమానంద స్థానమనియు- నాదబిందు కలాశ్రయమనియు- సగుణ నిర్గుణ స్వరూపమనియు- సర్వంబునకుఁ గారణమనియు వచింపఁబడుచున్నదో, అది యీ శివలింగని వాసస్థలంబే కదా?

శా. సేమం బారఁగ నగ్నిబింబ మచటం । జెన్నొందు నూహింపఁగా
నామధ్యంబున సూర్యబింబము దిరం । బైయుండు వీక్షింపఁగా
నామధ్యంబునఁ జంద్రబింబము మలం । బై యుండుఁ భావింపఁగా
నామధ్యంబున నం కురం బొకటి భ । వ్యాకారమై చెల్వగున్.

తా. సకలక్షేమంబుల కాలయంబగు నగ్నిబింబ మచటే ప్రకాశించును. తన్మధ్యమందే సూర్యబింబము విలసిల్లును. దానిమధ్యమునఁ జంద్రబింబమును- అందు సుందరమగు నంకురంబును నొప్పుచుండును.

క. అదిబీజము సర్వమునకు
నది యమృత పదంబు నిత్య । లానంద కరం
బది సంస్తుత తేజోమయ
మది శివలింగ స్వరూప । మదియు దలంపన్. ౧౭౮

తా. ఆబీజమే సర్వంబునకుఁ గారణంబై- యమృత ప్రదమై-తేజోమయమై శివ లింగమై మహానందము గలిగించు చుండును.

## —* శివలింగమహిమ *—

క. ఆదందఁ సకల సృష్టియు
నంద వర్తించునా స । హజలింగము సొం
పొందఁగ నాపోజ్యోతి గ
తిం దనరునులోన వెలిన । తిస్ఫుటలీలన్. ౧౮౦

తా. సకల సృష్టి యందును బ్రకాశించు నాశివలింగము వెలుపలను నాపోజ్యోతి రూపై వెలుంగు చుండును. ౧౮౧

వ. మఱియు.

తా. మరియు.

క. సురుచిర పీఠాగ్ర ఘటిత
హరినీలద్యుతి విధమున । నభినవ శోభా
కరమైన దివ్యలింగ
స్ఫురణము గర మొప్పు నాత్మఁ । జూడఁగ నెపుడున్. ౧౮౨

తా. పీఠముయొక్క యగ్రభాగంబున మెరయు నింద్రనీలమణి కాంతి మాడ్కిన వీన కాంతుల వెలిగకుచున్న దివ్య లింగమును నాత్మయం దెల్లపుడును జూచు చుండవలయును.

సీ. అదియాల వేదోక్త । లరయంగ నల్లని
మేఘంబు లోనుండు । మెఱుపుఁబోలె
శోభిల్లి నీవార । శూకంబు పగిది స
న్నంబయి పీతవ । ర్ణంబుతోడ
నణుతుల్యమై చెలు । వారుఁ బావకశిఖ
యా మధ్యమునఁ బర । మాత్మ యుండు
నదిబ్రహ్మ యదివిష్ణుఁ । డది శివుండది యింద్రుఁ
డది యక్షరంబగు । నదియ పరమ

నాసిబాహ్య విహీన • మైన తనము
తన్మధ్య భాగమం • తట మనోదృష్టిఁ ద
ప్పక విలోకింపంగఁ • బ్రస్ఫుటముగ

తే. గీ. బాలుపు మిగులు జ్యోతిస్స్వరూ • పుని నఖండ
మండలాకారమునుఁ బర • మంబు నైన
శ్రీసదాశివ లింగంబు • చిన్మయంబు
పొంపుమెఱయంగ నందదీ • పింపుచుండు.

తా. ఈపూర్ణిమాదృష్టిని నభ్యసించిన వెంటనే తారక యోగావధానను నేర్పవలయును ఇట్టి యభ్యాసకునికి, ద్వాదశాంతము మధ్యప్రదేశ మెదురుగాఁ గాన్పించు చూడును. అందు నావరించియున్న చీకటియందు మనోదృష్టిచే నవలోకించినచో, నఖండ జ్యోతిరూపమై చిద్రూపమై సదా శివలింగంబు ప్రకాశించు చుండును.

వ. ఇట్లుసహజలింగ సంజ్ఞగలిగి నిరంతరంబు నాత్మవిశ్రాంతి కరంబైన యంతర్లక్ష్యంబునాదు మనః పవనంబులు విలీనంబులుగా నొనరించి యచంచలిత చిత్తాన్వితుండై సంచరించునతఁడు జగద్గురుండగు నిది శాంభవీముద్ర ప్రకారంబు నిదియ యోగీంద్రులు ఖేచరీముద్రయందురు. ౧౮౯

తా. ఎయ్యది సహజలింగమని చెప్పఁబడుచున్నదో, ఎయ్యది యాత్మవిశ్రాంతి నొసంగునో, అట్టి యంతర్లక్ష్యమున మనోవాయువుల లీనమొందించి, నిశ్చలచిత్తుఁడై సంచరించువాఁడు జగద్గురువగును ఇదిశాంభవీ ముద్రావిధానము శివయోగులు దీనిని ఖేచరీ ముద్రయని వచింతురు.

—* లక్ష్యాను భవము *—

మ. ధరణిం గొందఱు సద్గురూక్తగతి నం • తః ఖేచరీ ముద్రికా
వరభాగం బెఱుఁగంగ నేరక కదా • నాలాయమున్ బాహ్య ఖే
చరిఁ జేపట్టి నిరూఢ సాహస మహా • సంరంభ విస్రంభ ని
ష్ఠురులై జిహ్వలుఁ గోసికొంద్రది మును • ష్కుల్ మెత్తు రే మెత్తురే. ౧౯౦

తా. ప్రపంచంబునఁ గొందఱు సద్గురువులు బోధించిన లోపలి ఖేచరీముద్ర నెఱుఁగ నేరక, మహా సాహసము వహించి బాహ్య ఖేచరిని నవలంబించి నాలుకలు గోసికొందురు గాని. దీనిని ముముక్షువులు సమ్మతింపరు.

క. అదిరయాసుర కర్మంబగు
నది సెప్పఁగ నేల ప్రాజ్ఞుల । లగువారు ముదం
బాదవఁగ నంతఃఖేచరిఁ
జెదరక శివలింగమును భ । జించుట యొప్పున్. ౧౯౧

తా. బుద్ధి మంతులగు వారసుర కర్మయగు బాహ్య ఖేచరిని వదిలి యంతఃఖేచరి నాశ్రయించి శివలింగమును సేవించు దురు.

సీ. యామద్వయం బమ్మ । హా లింగరూపంబు
నిశ్చింతుఁడై చూచు । నిర్మలునకు
మనసు వాయువును సా । మ్యస్వభావంబున
క్షీరోదక న్యాయ । మారఁగలయు
నారెంటియందు నె । య్యది సంచరించిన
రెండవదియు సంచ । రించుమండు
నారెంటియందు నె । య్యది నాశమయిన రెం
డవదియుఁ జయ్యన । నాశ మొందు

తే. గీ. నట్టిరెంటి యందును సాధ్య । మగల మెట్టి
వారలకుఁ బవనంబు గే । వలము రాజ
యోగ విరహితముగ హఠ । యోగచర్య
నబ్దశతములనైన సా । ధ్యంబుగాదు. ౧౯౨

తా. ఎవండా మహాలింగమును రెండు జాముల వరకు– నిశ్చల చిత్తముననేకాం చఁగలుగునో, అతనికి మనోవాయువులు క్షీరోద కన్యాయమునఁ గలియును. వాయువు చలించిన మనస్సు తిరుగును. మనస్సు నశించిన వాయువు నశించును. వాయువును నీవిధం బుగ రాజయోగమున నేసాధించ వలయును కాని, తది తరమగు హఠయోగమున నూరు వత్సరముల కైనను దానిని సాధింప నేరఁడు.

సీ. సద్గురునాథు ప్ర । సాద లాభంబున
క్షణములో రాజయో । గమున మనసు
నాశనమొందఁ దో । డ్నాశమౌ గాలియు
నితరులు కొండఱు । నేక మతము

లెంతయుఁ దగుబుద్ధి । మాతులు పోలె నిం
పు జపింప నేరఁ జె । ప్పుదురు గాని
శ్రీరాజయోగ సం । సిద్ధి బొందించు నే
ర్పరులు గల్గుట దుర్ల । భంబు ధాత్రి

తే. గీ. నెఱయ వేదాంత శాస్త్రప । నిషదభిజ్ఞు
లగుచు నున్నని భావంబు । లన్యులకు వ
చింతు రూరక కొందఱే । కాంతముల వ
సించి యుండుదు రనుభవ । సిద్ధి లేదు. ౧౯౩

తా. గురుప్రసాదంబు గలిగిన రాజయోగ మలవడును. రాజయోగమున మనస్సు నశించును. దానితో గాలి నశించును. కొందఱు తామొకయో బుద్ధి గలవారువలె సంశ సంబు జనించునటుల మాటల మాత్రము చెప్పుదురు. దానివలనఁ బ్రయోజన మిసు మంతి యుంలేదు. రాజయోగ సిద్ధిని దన్నుఁబొందింపఁ సమర్థులగు వారరుదు. వేదశాస్త్రాదుల భ్యసించి యున్న నీభావమును రహస్యముగా నితరులకు బోధింతురు. గాని వారనుభ వ మఱేరిచేనిప్పి యోజనమని గమనించలేరు. అనుభవ రహితులగు వారివచనములందు వి శ్వాస ముంచవలదు.

క. వారలచేఁ భ్రమలఁబడక
ధీరమతుల్ సద్గురూప । దిష్టసరణిఁ బా
రీరీతి శాంభవీ ము
ద్రా రుచిరాభ్యాస తత్ప । రతనుండఁగఁ. ౧౯౪

తా. ఇట్టి వారలచేత భ్రాంతినొందక సద్గురువు వలన శాంభవీ ముద్రనెఱింగి దా ని యభ్యాస మునసుండ వలయును.

ఆ. వె. అట్లుసహజలింగ । మభ్యంతరమున దీ
పించు నపుడు మొదలఁ । బెక్కువిధ
లగుచుఁదోఁచుఁ దార । కాకారమై వజ్ర
దర్పణంబు చంద । మేర్పడంగ. ౧౯౫

తా. ఎవనికి నంతరంగమున సహజమగు శివలింగము గోచరించునో, అంతే కం ముందు నయ్యది తారకా కారమై వజ్రముయ ద్దము పగిది పలువిధములఁగన్పించు చుండును

## —* సహజలింగలక్షణము *—

శా. లీలంబూర్ణ సుధాంశుమండలముఁ బో । లెంబూర్ణ మాణిక్య దీ
పాలోలాకృతివోలెఁ బెంపెసఁగుమ । ధ్యాహ్న స్ఫురద్భానుఁడుం
బోలెం బావకకీలఁబోలె నసిశం । బుంజక్షు రగ్రంబునం
దాలింగంబు వెలుంగు నద్భుతము గా । నంతస్థలక్ష్యంబునన్.

తా. ఆవిధ మెట్లనఁగా— నేత్రాగ్రంబు నందలియాలింగము చంద్రబింబమువలెను, మాణిక్య దీపమువలెను, మధ్యాహ్న కాలమందలి చండ భాస్కరుని విధమునను అగ్నిజ్వాలవలెనులోని లక్ష్యంబు నందుండెడిదై ప్రకాశించును.

క. సరిఁ బశ్చిమాభి ముఖమై
వరసుఖకరమై యభిన్న । పలయాకృతియై
కరమొప్పు నాత్మలింగ
స్ఫురణము గనవలయు బుధుఁడు । పూర్వ ముఖుండై. ౧౫౭

తా. వలయాకారమై పశ్చిమాభి ముఖమై వెలుంగు నాత్మలింగమును బూర్వాభి ముఖుండై విద్వాంసుఁడు గనుగొన వలెను.

వ. శశిజియు రోచస్ఫటిక ధూమ్ర బిందునాద కళానక్షత్ర ఖద్యోతదీప
నేత్ర సువర్ణకంజ కింజల్క దండ నవరత్న ముఖ్యంబు లాత్మలిం ౧౫౮
గ ప్రత్యయంబులు.

తా. స్ఫటిక కాంతులు- ధూమ్రకాంతి— బిందు— నాద—కళలు— నక్షత్రము— మెఱుపు—దీపము- నేత్రము, సువర్ణ కమలముకింజల్క దండము నవరత్నము కాంతులు మొదలుగా ననుభవంబునఁ గన్పించినవి యన్నియు నాత్మలింగజ్ఞానహేతువులని తలంచవలయును.

తే. గీ. అమృత మనఁగ నాపో జ్యోతి । యనఁగ బ్రహ్మ
మనఁగ నోంకారమన శివం । బనఁగవిష్ణు
కంటెఁ బరమ పదంబనఁ । గా శ్రుతిప్ర
చురము శివలింగమది గండు । సూజనులు. ౧౫౯

తా. అచ్యుత మన్నను- ఆపోజ్యోతి యన్నను- బ్రహ్మమన్నను-ఓంకారమన్నను శివమన్నను- విష్ణువుకంటెపరమ పదమన్నను బండితులు, వేదసిద్ధమగు శివలింగ మునే దెలిసికొన వలయునని చెప్పిరి.

సి. నారాయణుం డుపాసకుండనియు, శివుం డుపాస్యుండనియు వైదిక సిద్ధాంతము. అందువలన, శివుండే యధికుండని "యద్విష్ణో శేకముత్తమం" యద్విష్ణోః పరమంపదం మొదలగు శ్రుతుల వలన నిశ్చయింపం బడినది. నారాయణః పరః" ఇత్యాది స్థలము లందు, పంచమీ తత్పురుష సమాసమే చెప్పవలయును, గాని మరొక విధముగ జెప్పదగదు. అట్లు చెప్పినచో, బూర్వోత్తర భాగములు చక్కగా సమన్వయింపవు షష్ఠీ తత్పురుషము వచించుట కేవల మవిచార సంజనితమే యని దెలిసికొన వలయును.

ఆపోజ్యోతియనగా నేదియో దాని గురించియు అక్షి విషయమును గురించి యుబ్రహ్మవిద్య యనుగ్రంథమున నీక్రిందివిధముగా వచింపబడినది.

## అక్షి విషయము.

అక్షి యనంగా నేత్రము. ఇంద్రియములలో ప్రధానమగు నేత్రమును గూర్చి చెప్పం బడును.

చతుర్మధ్యే స్థితం గుహ్యమంగుష్ఠం పరమాత్మకమ్"
నేత్రమునకుమధ్యమున గోప్యముగ అంగుష్ఠమాత్రపురుషుండగు పరమాత్మయున్నాడు
" నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖా యామధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥

తైత్తిరీయోపనిషత్

నేత్రస్థాన మందుండెడి నల్లగుడ్డునకే నల్లకలువయని చెప్పుదురు. అందుమధ్యను నివ్వరి ధాన్యపు ముల్లువలెనే అతిసూక్ష్మమగు రంధ్ర మున్నది. అందు విద్యుల్లేఖ యనెడు మెరుపుతీగ ప్రకాశించు చుండును. అదియే కళ. నిష్కళయే పరమాత్మ స్వరూపము. ఈ నేత్రస్థానమే పరమాత్మస్థాన మనిపెద్దలు చెప్పుదురు. ఈకళయే ముక్తి కాంత యనియు జ్యోతియనియు స్వప్రకాశమనియు చెప్పుదురు. ఈప్రకారము వల్లనే సూర్యునికిని ప్రకాశము కలిగినది. సూర్యునివలన చంద్రునికి ప్రకాశము కలిగినది. కావున వెలుంగు నకు కారణము కళయేయని తెలియునది ఇదియే హిరణ్మయ కోశము.

సూర్యుని యొక్క కాంతి తెలుపని సర్వత్ర తెలిసిన విషయమే అంధ పరంపర ధానము. సూర్య కాంతి ప్రత్యక్షముగ తెలుపు రంగు గల దైనను నిజముగ చూడగా వివిధ

రంగులమొక్క చేరికయని తెలియఁ గలదు.

సూర్యకాంతి ముక్కోణపుటద్దము చేత భాగించఁబడి వివిధ రంగులు అయినట్లు నేత్రస్థాన మందును 7 రంగులు గలవు.

1. ఎఱుపు
2. నారింజ పండు వర్ణము- ఎఱుపు పసుపు కలిసిన వర్ణము
3. పసుపుపచ్చ వర్ణము
4. ఆకుపచ్చ వర్ణము
5 నీలవర్ణము— దీనికే నల్లగుడ్డు అనిచెప్పుదురు.
6 సునీలవర్ణము - ఇదియెపాప
7 ఇంద్రనీల వర్ణము

[అద్దముఁ దెచ్చి యందుఁగాంచు ప్రతిబింబమును జూచినచో నన్నిరంగులు తెలియఁగలవు ఈయేడురంగులు సప్తచక్రంబులనియు, అందలికళయే సుషుమ్న యనియు నిక్కళయే పరబ్రహ్మ స్వరూపమనియుఁ బెద్దలు చెప్పుదురు— 2, 3, 4, రంగులు కలిపి తెలుపుగా నెన్నఁబడును.]

ఎఱుపు— తెల్లగుడ్డు చుట్టునుండునది. పృధివీ తత్వము, క్రియా శక్తి, బ్రహ్మ అధిదేవత, అకారం మాతృక. అన్నమయకోశము, సద్యోజాత ముఖము.

తెలుపు— తెల్లగుడ్డు ఆపోతత్వము, జ్ఞానశక్తి, విష్ణువధిదేవత, ఉకారం మాతృక, ప్రాణమయ కోశము, వామదేవ ముఖము.

నలుపు— తెల్లగుడ్డుమధ్య నుండునల్లగుడ్డు తేజోతత్వము, ఇచ్ఛాశక్తి, రుద్రుఁడధిదేవత, మనో మయకోశము, తత్పురుష ముఖము.

సునీలము— నల్లగుడ్డు మధ్యమందు నీలమైన పాప వాయుతత్వము, ఆదిశక్తి, ఈశ్వరుఁడధి దేవత, అర్థమాత్రిక, విజ్ఞానమయ కోశము, అఘోరముఖము.

ఇంద్రనీలము— పాపమధ్య వెలిగేకళ, ఆకాశతత్వము, పరాశక్తి సదా శివుఁడు అధిదేవత, ఓంకార మాతృక, ఆనందమయ కోశము, ఈశానముఖము.

(ఈ యయిదురంగులు పంచచక్రము లనియు బిందువేత్రజ్ఞాచక్రమనియు కళయే సహస్రార మనియు నిక్కళయే పరబ్రహ్మ స్వరూపమనియు తెలియునది.)

నల్లగుడ్డునకే అండాండ మనియు, గంగయనియు, చంద్ర మండలనియు, నాదమనియు, ఇడయనియు, కామాక్షి యనియు, స్థూలదేహ మనియు, జాగ్రద వస్థ యనియు, తమోగుణ మనియు,

తా. అమృత మన్నను- ఆపోజ్యోతి యన్నను- బ్రహ్మమన్నను-ఓంకారమన్నను- శివమన్నను- విష్ణువుకంటెపరమ పదమన్నను బండితులు, వేదసిద్ధమగు శివలింగ మనియే దెలిసికొన వలయునని చెప్పిరి.

వి. నారాయణుండ పాసకుండనియు, శివుండుపాస్యుండనియు వైదిక సిద్ధాంతము. అందువలన, శివుండే యధికుండని "యద్విష్ణోరేకముత్తమం" యద్విష్ణోః పరమంపదం" మొదలగు శ్రుతుల వలన నిశ్చయింపం బడినది. నారాయణః పరః" ఇత్యాది స్థలము లందు, పంచమీ తత్పురుష సమాసమే చెప్పవలతెను, గాని మరొక విధమునం జెప్పదగదు. అట్లు చెప్పినచోం బూర్వోత్తర భాగములు చక్కగా సమన్వయింపవు మరి శిత్తునిగ్రహము వహించుట కేవల మవిచార సంజనితమే యని దెలిసికొన వలయును.

ఆపోజ్యోతియనగా నేదియో దాని గురించియు అక్షి విషయమును గురించి యోగబ్రహ్మవిద్య యనుగ్రంథమున నీక్రిందివిధముగా వచింపబడినది.

## అ క్షి వి ష య ము .

అక్షి యనంగా నేత్రము. ఇంద్రియములలో ప్రధాన మగు నేత్రమును గుర్కించిచెప్పంబడును.

చతుర్మధ్యే స్థితం గుహ్యమంగుష్ఠం పరమాత్మకమ్"
నేత్రమునకుమధ్యను గోప్యముగ అంగుష్ఠమాత్రపురుషుండగుపరమాత్మయున్నాడు
" నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూక వత్తన్వీ పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖా యామధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥

తైత్తిరీయోపనిషత్'

నేత్రస్థాన మందుండెడి నల్లగుడ్డునకే నల్లకలువయని చెప్పుదురు. అందుమధ్యను నివ్వరి ధాన్యపు ముల్లువలెనే అతిసూక్ష్మమగు గంధ మున్నది. అందు విద్యుల్లేఖ యనెడు మెరుపుతీగె ప్రకాశించు చుండును. అదియే కళ. నిష్కళమే పరమాత్మ స్వరూపము. ఈ నేత్రస్థానమే పరమాత్మస్థాన మనిపెద్దలు చెప్పదురు. ఈకళయే ముక్తి కాంత యనియు జ్యోతియనియు స్వప్రకాశునియు చెప్పుదురు. ఈప్రకారము వల్లనే సూర్యునికిని ప్రకాశము కలిగినది. సూర్యునివలన చంద్రునికి ప్రకాశము కలిగినది. కావున వెలుంగు నకు కారణము కళయేయని తెలియునది ఇదియు హిరణ్మయ కోశము

సూర్యుని యొక్క కాంతి తెలుపుఅని సర్వత్ర తెలిసిన విషయమే అంత సర్వోప ధానము. సూర్యకాంతిప్రత్యక్షముగ తెలుపు రంగు గల దైనను నిజముగ చూడగా వివిధ

రంగులయొక్క చేరికయని తెలియఁగలదు.

సూర్యకాంతి ముక్కోణపుటద్దము చేత భాగించఁబడి వివిధ రంగులు అయినట్లు నేత్రస్థాన మందును 7 రంగులు గలవు.

1. ఎరుపు
2. నారింజ పండు వర్ణము- ఎరుపు పసుపు కలిసిన వర్ణము
3. పసుపుపచ్చ వర్ణము
4. ఆకుపచ్చ వర్ణము
5 నీలవర్ణము— దీనికే నల్లగుడ్డు అనిచెప్పుదురు.
6 సునీలవర్ణము - ఇడిరియుపాప
7 ఇంద్రనీల వర్ణము

[అద్దముకు తెచ్చి యందులో బ్రతిబింబమును జూచినచో నన్నిరంగులు తెలియఁగలవు ఈయేడురంగులు సప్త చక్రంబులనియు, అందలికళయే సుషుమ్న యనియు నిష్కళయే పరబ్రహ్మ స్వరూపమనియుఁ బెద్దలు చెప్పుదురు— 2, 3, 4, రంగులు కలిపి తెలుపుగా నెన్నఁబడును.]

ఎఱుపు— తెల్లగుడ్డు చుట్టునుండునది. పృథివీ తత్వము, క్రియా శక్తి, బ్రహ్మ అధి దేవత, అకారం మాతృక. అన్నమయకోశము, సద్యోజాత ముఖము.

తెలుపు— తెల్లగుడ్డు అపోతత్వము, జ్ఞానశక్తి, విష్ణువధి దేవత, ఉకారం మాతృక, ప్రాణమయ కోశము, వామదేవ ముఖము.

నలుపు— తెల్లగుడ్డుమధ్య నుండునల్లగుడ్డు తేజోతత్వము, ఇచ్ఛాశక్తి, రుద్రుఁడు అధి దేవత, మనో మయకోశము, తత్పురుష ముఖము.

సునీలము— నల్లగుడ్డు మధ్యనుండు నీలమైన పాప వాయుతత్వము, ఆదిశక్తి, ఈశ్వరుఁడధి దేవత, అర్థమాతృక, విజ్ఞానమయ కోశము, అఘోరముఖము.

ఇంద్రనీలము— పాపమధ్య వెలిగేకళ, ఆకాశతత్వము, పరాశక్తి సదా శివుఁడు అధి దేవత, ఓంకార మాతృక, ఆనందమయ కోశము, ఈశానముఖము.

(ఈ యయిదురంగులు నయిదుచక్రము లనియు బిందు వేఆజ్ఞాచక్రమనియుకళయేసహస్రార మనియు నిష్కళయే పరబ్రహ్మ స్వరూపమనియు తెలియునది.)

నల్లగుడ్డునకే అండాండ మనియు, గంగయనియు, చంద్రమండలనియు, నాదమనియు, ఇడయనియు, కామాక్షి యనియు, స్థూలదేహ మనియు, జాగ్రద వస్థ యనియు, తమోగుణ మనియు,

పాపకే పిండాండ మనియు, యమున యనియు, నీలతోయద మనియు, శశ్యమండల మనియు, బిందు వనియు, పింగళ యనియు, మీనాక్షి యనియు, సూక్ష్మ శరీర మనియు, స్వప్నా వస్థ యనియు, రాజస గుణ మనియు.

పాపమధ్యము వెలిగేకళకే బ్రహ్మాండ మనియు, సరస్వతియనియు. విద్యుల్లేఖయనియు, అగ్నిమండల మనియు, కళయనియు, సుషుమ్న యనియు, విశాలాక్షి యనియు కారణ దేహమనియు, మహాకారణమనియు, చెప్పుదురు.

( ఈకళలలో నిష్కళయే పరబ్రహ్మ స్వరూపము. )

పృథివ్యాపస్తేజోవాయురాకాశములనెడు పంచభూతములు, క్రియాశక్తి జ్ఞానశక్తి యిచ్ఛాశక్తి ఆదిశక్తి పరాశక్తి యనెడు పంచశక్తులును, బ్రహ్మవిష్ణురుద్ర యీశ్వర సదాశివులనియెడి పంచ దైవతములును, అకారఉకార మకారఅర్ధమాత్రిక ఓంకారములనియెడు పంచమాత్రకలును, అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడు పంచకోశంబులును, అండాండపిండాండ బ్రహ్మాండములనియెడు అండత్రియమును, గంగాయమునా సరస్వతులనియెడు వేణీత్రియమును, సూర్య చంద్రాగ్ని మండలంబులనియెడు మండల త్రయంబును, నాదబిందు కళలును, ఇడాపింగళ సుషుమ్నలును, కామాక్షి మీనాక్షి విశాలాక్షి యనెడుఅక్షిత్రయమును, సత్వరజస్తమోగుణంబులును, మూలాధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత విశుద్ధాజ్ఞేయ సహస్రారంబులనియెడు సప్తచక్రంబులును, స్థూలసూక్ష్మ కారణ శరీరంబులనియెడు శరీరత్రయంబును, జాగ్రత్స్వప్న సుషుప్తులనియెడు అవస్థాత్రయంబును, నేత్రస్థానమందె నిరూపించబడియెను. సమస్త వృత్తులును నేత్రస్థానమందెపుట్టును. నిద్ర యును సంగమమందలి కోరికయును నచ్చటనే కలుగును. రేతోస్ఖలనము నాస్థానమునందే కలుగును. కావుననే రేతోస్ఖలన మప్పుడు నీరసమును నిస్త్రాణమును నేత్రముల యందు బరువును కలుగును. ఇదిస్వానుభవమువల్లనే తెలియఁగలదు.

"అణోరణీయా న్మహతో మహీయా నాత్మాస్య జన్తోర్నిహితో గుహాయామ్"

తైత్తిరీయోపనిషత్.

అతిసూక్ష్మములగు నణువును నతిస్థూలమైన మహత్తు కంటె మహత్తును నగు పరమాత్మ జంతువుల యొక్క బుద్ధిగుహ యందుండును.

"జాలసూర్య మరీచిస్థం యత్సూక్ష్మ తరంరజః
తస్యషష్టతమో భాగః అణురిత్యభిధీయతే॥"

ఇంటికప్పులోని సందులగుండ జారెడు సూర్యకాంతి 'లోని నలుసు యొక్క యారవభాగము నకు నణువని పేరు.

నేత్రిమ్యందలి పాపకు మధ్యము నివ్వరి ముల్లువంటి యతి సూక్ష్మమగు రంధ్రమున్నది. ఇక్కడి నుండియే నాడులు కపాలమునకు బోవును. ఆరంధ్రమధ్యమందు ముక్తి, కాంతియున్నది. నడినాళమనియు బ్రహ్మరంధ్రమనియు మేరుశిఖర మనియు సుషుమ్నా నాళమనియు చెప్పుదురు. అందుండెడి ముక్తి కాంతికే కళయనియు ఆపోజ్యోతి యనియు నందురు.

మనస్సును క్రమక్రమముగా లీనముచేసి, చూచువాఁడును చూడఁబడునదియును లేక, నిరామయుఁడై తుర్యావస్థనుపొందిముక్తినొందవలయును. ఉపనిషత్తులు చదివితిననియు మహావాక్య విచారణవల్ల పరబ్రహ్మమయితిననియు చెప్పుదురు అది భావంబు గాని యనుభవంబు గాదు. స్త్రీనిబొందితేనే ఆసుఖము తెలియవలయు గాని కామశాస్త్రము మొదలగు పుస్తకములు చదివినంత మాత్రముననే తెలియదు. సంగతులు మాత్రము తెలియును గాని అనుభవ ముండదు. అట్లె బ్రహ్మానందానుభవమును ఉపనిషత్తులు మొదలు గాఁగల పుస్తకములు చదివినంత మాత్రమునను, నాకు తెలుసును, అని విద్యామదముచేతఁ జెప్పినంత మాత్రమునను, ననుభవము గలుగ నేరదు. గాన మనస్సును వృత్తిరహితము చేసి యనుభవజ్ఞులు గావలయును.

చంద్రునికి సూర్యునివలననే కాంతిగలిగెను. గాని సహజ కాంతిలేదు. అసూర్యుఁడే పరబ్రహ్మమని కొందరు తలంచెదరు. అదియజ్ఞానము. సూర్యునికిని స్వతంత్ర కాంతిలేక సమస్త భూతముల యందు నంతరాత్మగా వెలిగే స్వప్రకాశము వల్లనే సూర్యునికి కాంతిగలిగినది ఈకళలతోను పరబ్రహ్మమని కొందరజ్ఞులు తలంచెదరు. ఆకళలలో నిష్కళమే పరబ్రహ్మము. ఇదినిశ్చయము.

చిదాకాశము.— ఇంద్రియ గోచరంబు లగువస్తువులు విషయంబులనం బడు. అట్టి విషయంబులందొక్కొక్కటి దెలివిచే గ్రహింపం బడియుండ నాతెలివి యాయా విషయంబును విడచి మఱియొక విషయమునకు పోవునపుడు పూర్వము పొందియున్న విషయంబును వదలుటచేతను నితర విషయంబుల నంటకుండు నాతెలివికి నేరూపంబో అదియె చిదాకాశంబు. స్థూలంబునకు చూచువాఁడు సాక్షియనియు, చూచువానికి మనస్సు సాక్షియనియు, మనసునకగ్రముగ బుద్ధియనియు, బుద్ధికగ్రముగ నాత్మయనియు, నాత్మకగ్రముగ పరమాత్మయనియు, పరమాత్మకగ్రముగ పరబ్రహ్మ మనియు పెద్దలయభిప్రాయము.

అఖండము.— రక్త శ్వేత కృష్ణనీల వర్ణముల మధ్యను ప్రకాశించు ఆపోజ్యోతినే నీలతోయదమధ్యస్థమయిన విద్యుల్లేఖ యనియు, అఖండమనియు చెప్పుదురు. ఇదియే అంతర్లక్ష్యము, గగనముద్ర, శిఖాస్థానము, అగ్నిశిఖ, సర్వసాక్షి, చిన్మయస్థానము, మేరుశిఖరము, కైలాస, సత్యలోక వైకుంఠములకు స్థానమనియుఁ జెప్పుదురు.

* షణ్ముఖీ లక్షణము *

వ. వక్త్రింబునఁ బ్రాణానిలంబుపూరించివహ్నిస్థానంబునందపానంబా కర్షించి రెంటినిసుస్థిరంబుగాధరియించి శ్రోత్రయుగ్మంబును నేత్ర యుగళంబును నాసాపుట యుగళంబును గ్రమంబునఁ గరతలాం గుష్టంబులు మొదలుగా నంగుళు లారింటిని నిరోధించి యివ్విధం బున షణ్ముఖీకరణ ప్రవీణులైన ధీరజనులు ప్రణవ బహువిధధ్యా నంబున విలీన చిత్తులై తత్ప్రత్యయంబుల విలోకింతు రదియునుం గాక చంద్రసూర్యదీప్తుల కెదురనిలిచి యైనను నిశ్చల గృహ దీప సమీపంబున నైనను సూర్యేందు సంగమ దృష్టిగలనున్న నిర్మ లమయిన యాత్మలింగ ప్రత్యయంబు లతి వ్యక్తంబులై వెలుంగు చు నయనాగ్రంబునఁ గానవచ్చు ననిన విగళిత వ్యాపారులై తత్ప రచేతస్కు లయినవారలకుఁగానవచ్చుటచోద్యమే. యట్లుగావున.

తా. ముఖమునందుఁ బ్రాణవాయువును బూరింప వలయును, వహ్నిస్థానంబునం దపానవాయువు నాకర్షించ వలయును. ఈరెంటిని జలింపనీయక స్థిరంబు గానుంచవలయు ను. రెండు చెవులను, రెండు నేత్రములను, ముక్కు రంధ్రముల రెంటిని కరతలములను వ్రే ళ్ళచేతను నిరోధించ వలయు, ఇటులషణ్ముఖి నవలంబించిన వారలు, ప్రణవనాదమునలీను లై తత్సుఖంబును గాంచుదురు.

ఇట్టి వారు, చంద్రసూర్యకాంతుల కెదురుగా నున్నను గృహదీప సమీపమందు నున్నను, సూర్యేందు సంగమ దృష్టిగల యాత్మలింగ చిహ్నంబులు స్ఫుట ముగా వారికి నేత్రాగ్రంబున గన్పించుచుండును. షణ్ముఖి నభ్యసించి నంతమాత్రమున న నేనిట్లుగన్పించు చున్న- నిరంతరము శివలింగమును ధ్యానించు మహాత్ములకుఁ గన్పించుట యాశ్చర్యమే.

సీ. శాంభవీముద్ర ని ♦ శ్చంచలంబగువారి
కాత్మలింగంబు ని ♦ రంతరంబు
నానావిధప్రత్య ♦ యములు గ్రందు కొనంగఁ
జిత్రంబుగాఁబ్రకా ♦ శించుచుండు
నమ్మైడనెట్లున్న ♦ నదియు యాసన మెట్టు
లున్ననభ్యాస మె ♦ ట్లున్న ముద్ర

పూర్ణిమా దృష్టియే । పొందుగనున్న నా
తర్లక్ష్యమును నెవ్వి । ధమున నున్న
తే. గీ. లింగసంబంధ మమరు నే । లీలనున్నఁ
జారుశివయోగ సౌఖ్య మే । సరణి నున్న
నంత లింగంబ యయిన్రోఁచు । నఖిలజగము
వెలయు లోనును నని యెడ । వేఱు లేక. ౨౦౧

తా. శాంభవీ ముద్రనలవడచు కొన్నను మహాత్ములకు నాత్మలింగము నేక విధములుగ గోచరించును. ఆసనము గుదుర కున్నను- తెక్కిన యభ్యాసములు లేకున్నను శివయోగ దృష్టి గలుగకున్నను ఆగ్రావలోకితము లేకున్నను, అంతర్లక్ష్యమున లింగ సంబంధము కుదురుటచేత వెలుపలను లోపలను ప్రపంచమెల్లను, లింగము గనుగనే తోచును.

ఉత్సాహా వృత్తము
ఇట్టియాత్మ లింగమూర్తి । నెపుడుఁజూచు వారికే
పట్టునందు నన్యకర్మ । పటుపరిభ్రమంబునం
బొట్టుపొరలు గాఁగనేల । భువినహింస యాదియై
నట్టియష్ట పుష్పములఁద । దర్చనంబు మేలగున్. ౨౦౨

తా. ఇట్టుల నాత్మలింగమందు నెల్లపుడు చూచువారలితరకర్మమార్గము లంబడిగొనక, యహింస మొదలయిన యష్టపుష్పములచే నాశివలింగమును బూజించుటతగును.

—। అష్టపుష్ప వివరము. ।—

. అష్టపుష్పమ్ము లె । వ్వ్యవియనఁగ నహింస
యనుపుష్పమును నింద్రి । యములనిగ్ర
హించుట యనెడి స । మంచిత పుష్పంబు
సత్యమ న్పుష్పంబు । సత్కృపాను
రావంబని యెడిపు । ష్పము క్షమయనెడి పు
ష్పంబు నఖండ సు । జ్ఞానమనెడి
పుష్పంబు తపమను । పుష్పంబు ధ్యానమన్
పుష్పంబు నని చెప్పఁ । బొలుపు మిగుల

తే. గీ. సనుదినంబు నీపుష్పంబు । లెనిమిదింట
నాత్మలింగార్చన మొనర్చు । టదియె కాదె
రాజయోగంబు మోదమా । రంగఁ దత్ప
రాయణుండైన యనఘుండు । రాజయోగి. ౧౦౩

తా॥ అహింస ఇంద్రియనిగ్రహము, సత్యము దయ, క్షమ, అఖండ జ్ఞానము, తపము, ధ్యానము, అను నెనిమిది పూలచే నాత్మలింగమును బూజించుటయే రాజయోగమని చెప్పఁబడును. ఇట్టివాఁడే రాజయోగి నాఁబడు.

క. మూసియు మూయని నయనో
ల్లాసంబున సుస్థిరాని । లము సంశయముల్
వాసిన మానసమునుంగల
యాసంయమి రాజయోగి । యై విలసిల్లున్. ౧౦౪

తా॥ అర్ధావలోకితమున, వాయు స్థిరత్వమును వానివలన మనోనైర్మల్యమును గలిగిన వాఁడే రాజయోగి నాఁబడు.

తే. గీ. తలపు శృంగాటకమునందు । నిలుపఁజేసి
సోమ రవుల త్రికూట । గామియగుచు
లోను వెలివాయు దృష్టిని । బూననేర్చు
నట్టియెడ రాజయోగి య । ష్టావధాని. ౧౦౫

తా॥ మనంబును శృంగాటక మందు నిలుపుటయు చంద్రసూర్య కాంతులతోఁ ద్రికూట స్థానము నొందుటయు, లోపలను వెలుపలను, వాయుదృష్టుల నిరోధించుటయు నను నెనిమిది కృత్యములచే రాజయోగి యష్టాంగ యోగియగుచున్నాఁడు.

వ. దృగ్దృశ్య భావ సుఖంబున నున్నతంబుగా నత్యంత గుహ్యంబును జీవన్ముక్తి కరంబును నైన యీశివయోగం బభ్యసింప వలయు సుజనుండు. ౧౦౬

తా॥ దృగ్దృశ్యభావ సుఖంబు గలిగి జీవన్ముక్తి నొసంగుచు రహస్యమై వెలసిన నీశివయోగమును సుజను లభ్యసింపఁ వలయును.

క. దానంబును శౌర్యంబును
నాసయతాత్మునకు వలయు । నట శబ్దాదుల్

త్యాగంబు బరిత్యజించుట
దానమగుం గాలజయము • తగు శౌర్యమగున్. ౧౦౭

తా. శివయోగులకు దానశౌర్యములు నుండవలయును. శబ్దాదులం బరిత్యజించుట దానమనియుఁ గాలమును జయించుట శౌర్యమనియు వచింపఁబడును.

౧౦౮

వ. అదియునుంగాక.

తా. వచనము.

## —* శివపూజాకాలము. *—

క. లింగార్చన దివమునం జ
ల్పగ వలదు రాత్రియును వ • లదు సతతంబున్
లింగార్చనం జేయగ వల
యుం గణంగి దినంబు రాత్రి • యును మానందగున్. ౧౦౯

తా. లింగార్చనమును బగలుగాని, రాత్రిగాని, చేయకూడదు. ఈ కాలమును వదిలి తక్కిన కాలంబున లింగార్చనంబు చేయ తగును.

వ. సూర్యేందు నాశనకాలంబు దివా రాత్ర విరహితంబైన కాలంబు లింగార్చన కాలంబని చెప్పంబడు.

తా. సూర్యచంద్రులు నశించిన కాలమనుట పేఁపగలు రాత్రియగు, ఆకాలంబున నే లింగార్చనము జేయందగును.

తే. గీ. రవిసుధాంశులాదురు దివా • రాత్రవిశద
సంజ్ఞకులు నాత్మ దృగ్వ్యాప్తి • సంజ్ఞకులును
వాసియందు మాగుతకును • మానసంబుఁ
దగుల నీకున్నం దత్కాల • మగును బూజ. ౧౧౦

తా. దివారాత్రులు లనినను నేత్రద్వయం బనినను, సూర్యచంద్రులకు సంజ్ఞలు ఈ సూర్యచంద్రులందు, వాయువును, మనస్సు నెప్పుడు గలసి కొనదో, అదియే పూజాకాలము

వ. మఱియు సర్వశాస్త్రార్థ సారంబును సద్యోముక్తి ప్రదంబును నైన
శివపూజా ప్రకారం బెట్లనిన. ౧౧౨

తా. సంప్రదాయ శాస్త్రప్రసిద్ధమై రహస్యమై, తత్ఫలమందేముక్తినొసంగు శివపూజా విధాన మెట్టు లనిన.

—* శివ పూజావిధి *—

క. ఏతలపును లేకుండుట
యాతత్త్వ ధ్యానరూప మయ్యెను గర్మ
వ్రాతము లెల్లనడిగి ని
శ్చేతనగతి నునికి పూజ సేయుటశివునిన్. ౧౧౩

తా. ఏతలంపును లేకుండుటయే యాపరమాత్మ ధ్యానమనియు, చేష్ట లుడిగిజడంబుపగిది పరమేశ్వర లీనమానసుఁడై యుండుటయు శివునిపూజించుట యనఁబడును.

శా. గంభీరం బెసగం బ్రదక్షిణ మనం గగా విశ్వలత్వంబు సో
హంభావంబు లసన్నమస్కృతివిధియం గ డార్ద్యోత్తముల్ పూనవి
స్రంభంబా శివ కీర్తనంబు జప మ శ్రాంతంబు సంతోషమున్
జృంభింపంబరిపూర్ణమాస్థితియనం జెన్నొందుఁ జోద్యంబుగాన్,

తా. గంభీరముగ నిశ్చలముగ నుండుటయే ప్రదక్షిణ మనియు, సోహంభావమే నమస్కార యనియు, శివ కీర్తనమే జప మనియు, నిరంతర సంతోషమే, పరిపూర్ణ స్థితియనియు నడుపఁబడు.

క. కృత్యంబు నకృత్యంబును
నత్యంతము నెఱుఁగకుండు టది శీలమగున్
నిత్యమగు మోక్షపద సాం
గత్యము సర్వంబు సమము గాఁజూడఁదగున్. ౧౧౫

తా. చేయరానిది, చేయఁతగినది రెండు నెఱుంగ కుండుటయే శీలమనియు సర్వమును సమముగాఁజూచుటయే మోక్షసాంగత్య మనియుఁజెప్పఁబడును.

క. ఈ తెలివిన్ భావాభా
వాతీతంబగు సమాధి యలసప నదిదాఁ

జ్యోగతి స్వాభావిక
స్థైతినరుట సిద్ధిసేయు § మనరాను మదిన్. ౨౧౬

తా. ఈజ్ఞానము చేతనే భావాభావాతీతమైన సమాధి యభ్యాస మగును. అభ్యా
ది స్వాభావికమై యుండుటచే మనస్సునందిటులచేయ వలయునని చెప్పవలను పడదు.

తే. గీ. సిద్ధమతమైన తన్మయ § సిద్ధిసహజ
యుక్తినొందుట నది రాజ § యోగ సిద్ధి
నిజ నిరంజన పదమట § నిరవలంబ
ముదియయని చెప్పుదురు తత్త్వ § విదులు ప్రీతి. ౨౧౭

తా. సహజముగా సిద్ధ సమ్మతిమై వెలయు పరమాత్మ స్వరూపము నొందుటయే
రాజయోగ సిద్ధిగలుగుట. తత్త్వజ్ఞులు దానినే నిరవలంబ మనియు నిరంజన మనియు వ
చించు చున్నారు.

వి. నిరంజనమన గా యంజనము వేసియదృశ్యములగు ధనమును భూతములను గనుగొ
ని నటుల గనుగొనుటకు వీలులేనిదని భావము.

—* తన్మయత్వ విచారము. *—

క. కలిలేని నిద్రగతిఁ బ
ట్టులునభమున సంచరించు § చొప్పున గడుఁ జి
న్నలభావంబున మృతు న
ట్లలవమునేనదియు తన్మ § యావస్థయగున్. ౨౧౮

తా. స్వప్నములులేక చెందెడి గాఢనిద్ర చందంబునను, ఆకాశమునఁ బక్షులుచరిం
చుచు నిశ్శబ్దముగా నిశ్చలముగా నుండు విధంబునను మృతి బొందినవాని విధమునను నుం
డుటయే తన్మయావస్థ యనఁ బడును.

క. సన్మతిమై ధ్యాన ధ్యే
యాన్మతి తద్గతియె కాదె § యోగము పిదపం
జిన్మయ శివైక్య భావనఁ
దన్మయమగు నేని దాన § తత్త్వంబెలమిన్. ౨౧౯

తా. మంచిబుద్ధితోను ధ్యానము చేసెను నాపరమాత్మ స్వరూపము నొందుటయే యోగము. ఇదికుదిరిన తర్వాత శివైక్యభావన గలిగి తన్మయత్వము నొందును

క. కడలుడిగిన జడధికై
వడిఁజలనములేని దివియు కై వడపుస ద్వంద్వా
బుడిగి పరిపూర్ణ భావ
బొడఁగూడఁగ నునికి తన్మ కై యోన్నతి జగతిన్. ౧౧౦

తా. తరంగములులేని సముద్రముచందంబునను, జలనములేని దీపము భంగిని, శీతోష్ణాది ద్వంద్వంబులు లేక పరిపూర్ణ భావంబున నుండుటయే తన్మయత్వ మనఁబడును.

క. పనుపడ భావాభావము
లను మానములేక విడిచి కై యర్థసమీపమై
సనుమృత భావము గైకొన
ఘనుఁడప్పు డతత్త్వమై ప్ర కై కాశించు భువిన్. ౧౧౧

తా. భావాభావములు– (ఇదిగలదు– ఇదిలేదు– అను భావనలు) వదిలి యొక్క యరనిముసమైనను జనిపోయినవానివిధమున నున్నపుడే తత్త్వస్వరూపుఁడై యోగి ప్రకాశించును

క. జీవన్ముక్తు నట్లన స
ర్వావస్థలు నుడిగి చింత కై లన్నియుఁ బోవం
గావిడుచు నతఁడకాఁడే
కైవల్య పదాధికారి కై గరిమ మెఱయఁగాన్. ౧౧౨

తా. జీవన్ముక్తునివలె జాగ్రదాది సర్వావస్థలను విచారముల వదిలిన వాఁడే మోక్షమార్గమున కధికారియగును.

తే. గీ. నిద్రమొదలుగఁ దెలివిమై కై నిలిచి తుదయు
నెట్టి భావము దాఁకొను కై నట్టిభావ
మరయు నేయోగి యందుఁ ద కై థ్యముగ గలుగు
తెల్లముగ ముక్తుఁ డతఁడ సం కై దేహమేల. ౧౧౩

తా. నిద్రాప్రారంభ దశనుండి మేలుకొను నంతవరకు నెట్టి భావమునఁ జనుండు నో, అటులే యుప్పునుండిఁ నాతఁడు ముక్తుఁడని చెప్పఁబడును. సందేహమేమియు లేదు.

క. లోనును వెలుపలయును నభి
మానంబులు వర్తనములు మఱచినిరాలం
బానంద పదవి నొందిన
యాసలుకడ గాదె ముక్తుఁ డౌట దృఢముగాన్. ౩౨౪

తా. బాహ్యాంతరము లందలి యభిమానమువదిలిచెడునడతల విడిచినిరాధార మగు
నానంద మార్గము నొందిన వాఁడే ముక్తుఁడనఁబడును.

క. మనురూపంబు మనోగతి
యునునాయాసంబు లగుట నుడుగఁగ వలయున్
వినుత నిరాయాస పదం
బను నిరాలంబ పదవి నందుదురు బుధుల్. ౩౨౫

తా. రూపము- మనోగమనము- ఆయాస మగుటను విడువ వలయును. నిరాయా
సమైనస్థానమని పండితులు నిరాలంబ పదవినే పొందుచుందురు

క. మఱవని యెఱుకయు మఱితా
మఱచితి ననుమఱపు రెండు మఱచిన విధమ
య్యెఱుకా తెఱఁ గొందినన
త్త్రిదా తత్త్వంబయైన తెఱియగుఁ బ్రేమన్. ౩౨౬

తా. ఎఱుకయనఁగాజ్ఞానము- మఱపు-అనఁగామాయ- జ్ఞానమును-మాయయును నేది
యులేక- అవాఙ్మానస గోచరముగనుండు నాతత్త్వమే పరమాత్మయై వెలయును.

వ. ప్రమాణ ప్రత్యయాతీతంబు శాంతి తేజోమయాత్మకంబగు త
ద తీతంబు పరబ్రహ్మంబు విద్వజ్జనుల చేత నుదీరితంబయ్యె నది
య పరతత్త్వంబు వెండియు నాధారమధ్య మహావ్యాప్తి నాద
బిందు కళాతీతంబైన పరమ పదంబును నిరాశ్రయంబును నిరవ
లంబంబును నిరామయంబును భావనా విరహితంబును నవ్యయం
బును నని చెప్ప నొప్పునట్టి పరబ్రహ్మంబనంగఁ బరశివుండని తెలిసి
తత్త్వలీనమానసుండైన మహాత్ముండు తన్మయుండై నిత్యానంద
బును బొందు నట్లు గావున. ౩౨౭

తా. ప్రమాణముల కందనిది, తేజోమయాత్మక మైనది. తదతీత మైనది పరబ్ర హ్మయని పండితులు పల్కుదురు. పరమాత్మ- నాదబిందు కళాతీతమగు పరమ పదము. నిరవయవము- నిరాలంబము— పరశివుఁడు- మొదలగు నామంబులచేఁ బేరొందిన బహుచిన్న యాపరతత్త్వమందేలీనమనస్కుఁడైయున్న మహాత్ముఁడు నిత్యానందమనుభవించును. కాబట్టి

తే గీ. గరిమమెఱయ సంకల్ప వి । కల్పశూన్య
మై విచిత్రాస్పదంబైన । భావయోగ
మలవడఁగ నెవ్వనికిఁ గల్గు । నమ్మహాత్మ
నకురయమ్మన సిద్ధించు । నయ్యవస్థ ౨౨౮

తా. సంకల్ప వికల్పములులేక విచిత్రంబాల కాలయంబగు భావయోగ మెవనిక భ్యాసమగునో, ఆమహాత్మునికిగాని యట్టి యవస్థ యితరులకు రానేరదు.

ఆ. వె. అట్టియోగి వర్యుఁ । డస్తిత్వ మణుమాత్ర
మైనఁ గల్గునేని । నదియు బంధ
హేతువగుట సిద్ధ । యించి భావమున భా
వంబు సంత్య జింప । వలయునంత. ౨౨౯

తా. అటువంటి యోగీంద్రుఁడు- బంధహేతువగు నస్తిత్వమును విడిచి భావము వ భావంబునుగూడఁ బరిత్య జింపవలయును.

వ. సర్వావస్థల యందుఁ నకృత ప్రయత్నుండగుచు జ్ఞాన జ్ఞేయంబులు ను ధ్యాన ధ్యేయంబులును లక్ష్యా లక్ష్యంబులును, నూహాపోహం బులును దృశ్యా దృశ్యంబులును సర్వంబును విడిచి నిశ్చితుఁడై యున్న యతండు జీవన్ముక్తుండు. ౨౩౦

తా. సర్వావస్థలను విడిచి జ్ఞానము [తెలిసికొనుటకు సాధనము] జ్ఞేయము (తె లిసికొనఁ దగినది) ధ్యానము (ధ్యానించుట) ధ్యేయము [ధ్యానము చేయదగినది] లక్ష్యము (చూడదగినది) అలక్ష్యము (అదృశ్యమైనది) ఊహాపోహాలు సంకల్పవికల్పములు- దృశ్యా దృశ్యములు- మొదలగునవియన్ని యువిడిచినిశ్చింతతో నున్న వాఁడే జీవన్ముక్తుఁడగును.

—* జాగ్రదాద్య వస్థాపంచకము *—

క. క్రమమున మఱిజాగ్రత్స్వ

ష్నములు సుషుప్తియు దురీయ । నామకిమును సం
యమి వర్యులు తుర్యాతీ
తము ననెడియవస్థ లెఱుఁగ । దగునీ వైరాః. ౨౩౧

తా. శివయోగులు- జాగ్రిత- స్వప్నము- సుషుప్తి- తురీయము-తుర్యాతీతము- అనునైదవస్థలను గుర్తెఱుంగ వలయును ౨౩౨

వ అవ్విధం బెయ్యది యనిన.

తా. ఆప్రకార మెటులనఁగా.

—* జాగ్రదవస్థాధికారి లక్షణము *—

తే. గీ విదితముగఁ బాపకర్మముల్ । విడిచిపుణ్య
కర్మతత్పరుఁడగుచు స్వ । ర్గమునకు న్మ
ఖుఁడగు నరుండు దాఁబ్ర । వృత్తుఁడుగాన
కాఁడు జాగ్రద వస్థాధి । కారి యతఁడు. ౨౩౩

తా. పాపకర్మలను జేయక సదాపుణ్యకర్మలనే చేయుచుస్వర్గమునకు వెళ్లువాఁడు ప్రివృత్తుఁడు గాన, జాగ్రిద వస్థాధి కారమున కనర్హుఁడు.

తే గీ. సకలభవ సుఖంబులుఁ జాలుఁ । జాలుననుచు
నెలమి మోక్షోన్ముఖుఁడగు । నెవ్వ డప్పు
డభినుతింపంగఁ దగు నివృ । త్తాఖ్యుఁ డాతఁ
డతఁడు జాగ్ర దవస్థా న । మన్వితుండు ౨౩౪

తా. ఈజన్మ యందను భవించు సుఖములు చాలు. ఇక సుఖ మవసరములేదు అని తలంచి మోక్షమార్గమున కేవఁడభి ముఖుఁడగు చుండునో, వాఁడు నివృత్తి మార్గరతుండు. జాగ్రి దవస్థాహ్వుఁడు.

క. ఈసంసారోత్తరణా
పేక్షఁ త్క్రియఁ గలుగు నొక్కఁ । యిదినాకనుచుం
జ్ఞానసద్గురు సంసేవకుఁ
డై సాధు జనైక సంగ । మాభి రతుండై. ౨౩౫

తా. ఈ సంసారము నుండి తరించు నుపాయ మేమి నాకుం జెప్పుడనా యని విచారించుచు సాధుజన సహవాసమున సద్గురువు నాశ్రయించవలెను.

ఉ. కామవిదూరుఁడై నిహిత ♦ కర్మము లేన యాచరింపుచుం
గామముఖారులం గెలచి ♦ గాఢవిరక్తి వహించి మౌనని
ష్ఠామతియుం శమంబు శ్రుతి ♦ శాస్త్రసునిశ్చయభావముం సము
ద్దామ శుచిత్వముం బరమ ♦ ధైర్యముఁ గల్గియలభ్యశీలుఁడై. ౨౩౬

తా. తాను శాస్త్ర విహితములగు కర్మల నాచరించుచు కామము- మోహము మదము- మొదలగు నరిషడ్వర్గమును గెలిచి మౌనంబును- శమంబును- శ్రుతి- శాస్త్రములందుఁ బాండిత్యమును- శుచిత్వము- ధైర్యముగలవాఁడై యుండవలయును.

క. ఆగురునాథోక్తగతిన్
యోగాభ్యాసంబు సేయు ♦ చుండెడు సుజ్ఞా
నాగారుఁడు జాగ్రదవ
స్థాగరిమా కలితుఁడైన ♦ సజ్జనుఁడు గదా. ౨౩౭

తా. గురునాథుఁడు చెప్పిన విధమున యోగము నభ్యసించు సుజ్ఞానియే జాగ్రదవస్థలోఁ గూడిన సజ్జనుఁడు.

తే. గీ. వరుసఁ బురుషుండు జాగ్రద ♦ వస్థ యందు
మరణమును బొందెనేని ♦ గ్రక్కునఁ జనించి
యంతనతఁడు స్వప్నావస్థ ♦ నాశ్రయించు
నిర్ణయముగఁ బూర్వాభ్యాస ♦ నియతి కతన. ౨౩౮

తా. పురుషుఁడు జాగ్రదవస్థలో మరణించినచోఁ బూర్వాభ్యాస వశంబున దిరిగి జన్మించి స్వప్నావస్థ నాశ్రయించి యుండును.

— * స్వప్న సుషుప్త్యవస్థాధికారుల లక్షణము. * —

సీ. స్వప్నంబు విధమున ♦ శరదభ్ర రూపంబు
కైవడి నఖిల లో ♦ కంబుఁ గనుచుఁ
దనదు చిత్తంబు స ♦ త్తామాత్రమై యుండు

నొప్పు స్వప్నావస్థ నున్న యోగి
యల సుషుప్తి స్థితుం డగు సంయమీంద్రుండ
ద్వైత భావంబు స ర్వంబుం దొలంగ
నంతకంతకు శాంతి నతిశయింపంగం జిదా
నందభానుండు వెలుం గొందుచుండు

తే గీ. వార్షమారంగ బాహ్యంబు నందు వివిధ
వృత్తియుతుండయ్యు హృదయ ని వృత్తుండగుచుం
జిత్రరూపంబు వోలె వి చిత్రభంగి
నెల్లవారు నుతింప శో భిల్లుచుండు. ౧౩౧

తా. శరన్మేఘంబు వలె- స్వప్నమువలె- సకల జగంబును జూచుచు. దనచిత్తం బును సత్తామాత్రింబుగా నుంచి స్వప్న స్థలంబునున్న యోగి ప్రకాశించుచుండును. సుషుప్తిలోనున్న యోగి యద్వైత భావనాశమున సర్వము దొలంగ, చిదానందము నతిశయింప, బాహ్యమున, వృత్తిసహితుండైనను, లోపల వృత్తిరహితుండై చిత్రరూపమువలె నెల్లరును గొనియాడు చుండం బ్రకాశించు చుండును.

## —* తురీయావస్థాధికారి లక్షణము. *—

చ. అనమృతుండయ్యుం దానమృతుం డైగతమానసుండై యజస్రమున్
ఘనతర శాంతుండై గళిత గాఢ గుణోత్తరుండై యహంకృతిన్
మును బెడంబాసి యోగిజన ముఖ్యుండుగాంగం దురీయసంయుతుం
డెనయంగ జీవ ముక్తిని వ హించను బావనుండై ప్రసిద్ధుండై

తా. తురియావస్థయందున్న యోగి, చచ్చినను జావని వాడై మనోవృత్తిని వదలి శాంతిగలిగి బంధగుణములను విడిచి యహంకార శూన్యుండై యోగీంద్రులలోం బ్రసిద్ధుండయి జీవన్ముక్తిని వహించి యుండును. ౧౪౧

వ. మఱియు.

తా. మఱియు.

మ. సముదీర్ణాంబుధి మధ్యసంస్థిత లస త్సంపూర్ణ కుంభంబు చం

దముర్వీ విష్ణుపదాంతరాళ వికస । త్సంశూన్య కుంభంబు లా
గమొర్వీ లోపల వెల్పలం బ్రథిత పూ । ర్ణాత్మాంతి సంశూన్య భా
వములం బొందు దురీయ సంగతుడు । భాస్వచ్ఛిద్ర దీపస్థితిన్

తా. సముద్ర మధ్య యందలి పూర్ణ కుంభము వలెను, ఆకాశ మధ్య యందలి శూన్య కుంభము వలెను, ఛిద్ర దీపమువలె లోపల వెలుపల పూర్ణ భావముల నొందుచుండు వాడే తురీయావస్థా సంయుక్తుడు.

## —* తురీయాతీతావస్థాధికారి లక్షణము. *—

సీ. కొందఱు బ్రహ్మనా । గొందఱు గోవిందు
డనగ గొందఱు శివు । డనగ గొంద
ఱన్నివిధములైన । యితర దైవత భేద
ముల గణింపగ బ్రకృతి । పురుష కాల
రూపంబనియు నర్థ । రూపంబనియు వేఱ
కొందఱు దీపింప । గొందఱట్లు
సొరిగి వికల్పాత్మక । ములు నైన బహువాక్య
ములు దమ్ము జెప్పంగ । నలఘు మహిమ

తే. గీ. జారుతర తురీయాతీత । సంజ్ఞగలయ
వస్థ బాపించి త్రిభువన । వంద్యుడైన
యోగివర్యుండు దేహ సం । యుక్తుడయ్యు
నిత్యముక్తుడై యెల్లచో । నెగడుచుండు. ౨౪౩

తా. బ్రహ్మ యనియు— శివుడనియు— గోవిందుడనియు నింకను నితర దైవములనియును— ప్రకృతి పురుషులనియు— కాలమనియు— అర్థరూపమనియు నితరులు వచించు నామము లన్నియు దానినే చెప్పుచుండ, త్రిభువన వంద్యుడయి దేహముతో గూడియున్నను నిత్యముక్తుడయి తురీయాతీతుడు విలసిల్లుచుండును.

వ. కావున సర్వ ప్రయత్నంబుల నభ్యాసయోగంబున దత్త్వజ్ఞులు తు
రీయాతీతావస్థంబొంది యఖండానంద మందిరులై యుందు రే

౨౮౮

ప్పు నదియునుంగాపున.

తా. కాబట్టి యభ్యాస వశమునసే తత్వవేత్తలు తుర్యాతీతావస్థను బొందియు మోదమును నానందమును బొంది యుండుటవగును.

క. సర్వావస్థలం బొందియు
సర్వావస్థలును మఱచి జనుదోష్ఠో నీ
యున్నేనటమున్న సంగము
సర్వంబు రయంబునవి సర్జింపఁ దగున్. ౨౮౯

తా. సర్వావస్థల నొందియున్నను వానిని వెంటనే మరవవలయును. సంగము నె ప్పుడును గలిగి యుండగూడదు.

అవస్థా వివరణము.

శ్లో॥ నేత్రస్థో జాగ్రతిం జీవః కంఠే స్వప్నం సమాదిశేత్
సుషుప్తింహృదయస్థస్స్యాత్ తురీయం మూర్ధ్ని సంస్థితః॥

* జాగ్రదవస్థ. *

జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతఃకరణము విషయములతోఁ గూడి పరాశక్తి సహితుఁడయి యాత్మ నేత్రస్థానము ద్వారా సర్వపదార్థములఁ దెలిసికొనుటయే జాగ్రదవస్థ, ఈయవస్థలో నున్నపుడు జీవునికి- విశ్వుఁడు- చిదాభాసుఁడు- వ్యావహారికుఁడు. అను నామము లుండును.

* స్వప్నావస్థ *

ఈపదునాలు గింద్రియములతో నాత్మ కంఠస్థానమునకు వచ్చినపుడు గలుగు నవస్థయే యీస్వప్నావస్థ, ఈయవస్థలో జీవుని నామములు- తైజసుఁడు స్వప్నకల్పితుఁడు- ప్రాతిభాసికుఁడు- అనిచెప్పఁబడును.

* సుషుప్త్యవస్థ. *

మనోబుద్ధులతో నాత్మ హృదయమునకు వచ్చినప్పుడు గలుగునవస్థయే సుషుప్త్యవస్థ ఇట్టితరి యింద్రియములన్నియు నవిద్యలోఁ గలియును. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వ్యాపార శూన్యములు కాగా నీ నిద్రపోవు మాత్మ కేవలమానందము ననుభవించును.

ఈయవస్థ నభిమానించికొనిన జీవునికి- ప్రాజ్ఞుఁడు, అవచ్ఛిన్నుఁడు- పారమార్థికుఁడు- అను పేరులుండును.

### తుర్యము.

ఆత్ముఁడు మూర్ధమునందుండి తానుజూచిన వస్తువు నిట్టిదని చెప్పలేక పోవుటయే తురీయము.

### * తురీయాతీతము *

ఆత్ముఁడొకఁడయి మూలాధారమునకు వచ్చినపుడు, తిన్నదానుమరచి పరమానంద సుఖస్వరూపంబున నుండి యథా ప్రకారంబుగా దినుచుండుటయే తుర్యాతీతము. దీనికే యమనస్కము. ఉన్మన్యవస్థ యనునామములు వ్యవహరింపఁ బడుచుండును. యోగులీ యవస్థాపంచకమును దెలిసి కొనియే యుండవలయును.

### —* అమనస్క విచారము *—

తే. గీ. మఱిగియు నన్యములైన క । ర్మములుమాని
పరమ శివయోగ సంతతా । భ్యాస వృత్తి
నతుల సహజైక సంవిన్మ । యామనస్క
ముద్ర భజియింప వలయు మ । మఁక్షు జనులు. ౨౮౬

తా. ఇతరకర్మలుమాని శివయోగాభ్యాసమున నమనస్కముద్రను నేర్వవలయును.

క. క్రమమున నాత్ముని బిందువు
నమరఁగ గగనమునఁ జేసి । యంతర్భ రెండుఁ
సమరసమున నొందించిన
నమనస్క విధానమదియె । యాత్ముడు మహాత్ముఁల్. ౨౮౭

తా. గగనంబున నాత్మబిందువుల సమరస భావము నొందించుటయే యమనస్కమనఁబడును.

వ. ఉన్మని మనోన్మని సహజమనస్కంబు సహజా మనస్కంబు జాడ్య నిద్ర యోగనిద్ర యనునవి రాజ యోగంబునకుఁ బర్యాయ నామంబులై శాస్త్ర రహస్యంబులై యుండు నీవివిధ శబ్దార్థం బులే యు నేకంబు ౨౮౮

తా. రాజయోగమునకు— ఉన్మని— మనోన్మని— సహజ మనస్కంబు, సహజామనస్కంబు, జాడ్యనిద్ర, యోగనిద్ర యనునవి పర్యాయ నామములై యొప్పును. అర్థభేదమేమియుఁ లేదు.

క. అమనస్క సౌఖ్య మచ్యుత
మమలం బనన్యశ సుఖాఢ్య మక్షయ మవిత
ర్క్యమ్ము సుచంచల మమృత మనుం
బమితంబన యెఱుఁగుదురు మహా సిద్ధవరుల్. ౨౪౯

తా. అమనస్క సౌఖ్య మింతయని చెప్ప నలవిగాదు. అచ్యుత మమము, అక్ష
యమునగు దానిని సిద్ధులు బాగుగా నెఱుంగుదురు.

సీ. అమనస్క సుఖకేళి నవరతానంద
యుక్తాత్ములగు శివ యోగివరులు
బాహ్యసుఖము లాస పడ రట్లకాదె సం
సారంబు నందశే షంబు నరయ
దుఃఖంబకాక యం దున సుఖంబెద్ది? సం
కమునఁ దేలఁగఁ దాసు ఖంబుగలదె?
యట్లు సంసారు లగు వారికెల్ల దుః
ఖము వెలిగాగ సు ఖంబు లేదు

తే. గీ. జగతినటుగాన శాశ్వత సహజసౌఖ్య
భరితులగు యోగివర్యు లెబ్భంగినైనఁ
బ్రకటతర దుఃఖ గర్భ దుర్భవ సుఖంబు
నెమ్మినాసింప కుందుల నిశ్చయంబు. ౨౫౦

తా. అమనస్క సౌఖ్యము ననుభవించుచున్న యోగీంద్రులు బాహ్యసౌఖ్యము నభిల
షింపరు. సంసారంబంతయు రోంపి సుమా! అందు దుఃఖమే గాని, సుఖ మావంతయు
లేదు. ఇట్లని తెలిసికొని శాశ్వత సౌఖ్యముగల యోగీంద్రులు దుఃఖ మయమగు జన్మల
ను గోరరు ఇది నిశ్చయము.

వ. అయ్యమనస్క ప్రకారంబు సంయమీంద్రులు మోఢియు నలివిశ
దంబుగ నెఱుగుదు రవ్విధం బెట్టిదనిన. ౨౫౧

తా. యోగీంద్రులిలా యమనస్క ప్రకారమును బాగుగా నెఱుంగుదురు. అవిధ
ము వచించెదను.

సీ. శాంభవి ముద్రావి । శారదుఁడగు యోగి
యాత్మలింగ ప్రత్య । యంబు లాత్మ
జూడంగఁ జూడంగ । శూన్యంబునగు నాత్మ
నాసదాశివలింగ । మప్రమేయ
మును బరమాకాశ । మును నిరాలంబంబు
నద్వయమును నల । క్ష్యమున నామ
కంబు నానంద మ । యంబు నాద్యంబు ని
త్యంబును సర్వగ । తంబు సర్వ
తే. గీ. కారణము నిరంజనము న । పారమును న
చంచలంబును వేదాంత । శాస్త్ర విశ్రు
తంబునైనట్టి నిర్గుణ । తత్త్వమగుట
తెల్లముగఁ దోఁచు నతనికి । నుల్లమునను. ౧౯౨

తా. శాంభవీ ముద్రను గుర్తెఱిఁగినయోగి, యాత్మలింగ లక్షణంబులు చూడఁ జూడఁ జివరకు శూన్యంబగును. ఆసదాశివ లింగమే, నామరహితము, అలక్ష్యము, నిరంజనమునగు నిర్గుణ తత్త్వముగ హృదయంబున నతనికి దోఁచును.

క. ఆతఁడె నాతని మానస
మాతత్త్వమునందు లీన । మగు నింద్రియ సం
ఘాతములో శీఘ్రంబున
నీతెఱఁగ మనస్కమయ్యె । నెంతయుఁ బ్రీతిన్. ౧౯౩

తా. ఇంద్రియ సమూహముతోఁగూడ మానసమా తత్త్వమందు లీనమగుటయే యమనస్క మనఁబడును.

వ. భావంబున భావంబును, స్వప్నంబున స్వప్నంబును, మృతియందు మృతియు గాని సుస్థితి మనోన్మనీ ప్రాప్తి గల శివయోగి పుంగవునకుఁ గలుగు. అమనస్క సంపన్నుఁడు వినష్టేంద్రియా నిలుండును నివాత దీపంబునుంబోలె దీపింపుచుండు. వెండియు శుష్క కాష్ఠంబువోలెఁ గానఁబడు. సన్నిపాత మూర్ఛా నిద్రావ్యాధులును, ఉచ్ఛ్వాస నిశ్వాసంబులును లేని యోగీంద్రునకు గలుగు లయంబు

సహజావస్థయని చెప్పనొప్పు నిదియకాదె సర్వేంద్రియ గుణ రహి
తయు రూపాతీతయు నిరంజనయు శాంతాంతశాంతయు ననందగు. స
హజానంద స్థితుండైన తత్త్వవిదుని యహోదాసీన్యతవలన యుండలియ
సంకల్ప సలిలంబుచే నున్మూలనంబై కడునశించెడు మనోమూలజ ౩౫౮
గద్వృక్షంబు.

తా. అనవస్కమును నొందినయోగి యింద్రియానిల సంచార మాగిపోవ, వాయు
వులేని ప్రదేశమందలి దీపంబువలెఁ బ్రకాశింపుచుండు, ఇట్టి మహనీయునికే స్వప్నము
లో స్వప్నమును, భావములో భావమును, ప్రాప్తించును ఎండిపోయినకట్టెవలెనాతఁడుండును
సన్నిపాతాదివ్యాధులుగాని, యుచ్ఛ్వాస నిశ్వాసములుగాని లేక మెలంగెడి యోగికిఁ
గలుగు లయమే సహజావస్థయని వచింపఁబడును. గుణరహిత, రూపాతీత, మొదలగు
నామంబులచే నిదియే పేర్కొనఁబడును. తత్త్వవేత్తయొక్క యుపేక్షయనెడి నదీప్రవాహం
దు మొలచిన మనోవృక్షము, అసంకల్పమనెడి యుదక వేగమునఁ గ్రుంగుటచే వేళ్లతోఁగూ
డఁగూలిపోవును.

క. వివిధవిషయ ప్రపంచ మె
దవుఁ దెలివింగొనఁ బడక శూన్యతఁ దోయుచు నిద్రన్
భువినట్లగుటం దెలివియు
నవలన్నిద్రయును నుడిగి యానందమునన్. ౩౫౯

తా. విషయ లంపటములగల ప్రాపంచిక విజ్ఞానమనెడి యంధకార రూపంబునఁ బ
డక, నిద్రచేశూన్యభావంబు నొందుచు, నావల క్రమముగా నా తెలివిని నిద్రను వదిలిన నా
నందముపొందగును.

వ. మనోన్మనీ కలితుండై పరతత్త్వ భజనంబొనరించి కృతార్థుండగు త
త్త్వజ్ఞుండు. ౩౬౦

తా. అనంతర మాతఁడు మనోన్మనితోఁ గూడికొని పరతత్త్వ సేవయందుఁ గృతా
ర్థత్వ మొందును.

సీ. కర్మమించుకయైన సంఘనదుఃఖదము కర్మ
శూన్యత్వ మత్యంత సుఖకరంబు

గావున సహజమా ర్గంబునఁ గర్మంబు
తేదది సులభంబు లీలనుండు
బుధులు చిరంబుగాఁ బుద్ధినిల్పఁగఁదగు
వేయునేటికి నది విపులసౌఖ్య
ములకాది కారణం బులగు కర్మముల కా
సించుక యట్టిదై పిన సుఖంబు

తే. గీ. స్వల్పమెంతయు నిట్టి చో • ద్యంబుగలదె
యెందునే కర్మములులేని • యా సహజము
వలన నేవేగ యోగి • వర్యులకుఁ గల్గు
మోక్షసౌఖ్యంబు మహనీయ • ముఖ్యమౌను. ౨౫౪

తా. కర్మయే మాత్రమున్నను, దుఃఖము నిచ్చును, కర్మశూన్యత్వము సుఖంబొసం గును ముక్తిమార్గమునఁ గర్మము లేనేలేదు. ఉన్నను నది సులభముగా నుండును. అనే క దుఃఖముల కాలయమునైన కర్మంబులఁ గోరనైన యిక్కాంక్షను గోరుట పండితులకు నే దగదు సహజ మార్గాను సారమున యోగుల కత్యుత్తమ సుఖంబు సంభవించును.

చ. స్థిరమతి నిష్కళాభ్యసన • నేపునఁ జెంది నిగమాంతవిద్య యం
దరుదుగ సక్తిఁగల్గి సహ • జైక సుఖాత్ముఁడైన సంయమీ
శ్వరుఁడొగి నెట్టికర్మములు • సల్పుచు నుండిన నట్టికర్మముల్
ధరణి నకారణంబులగుఁ • దథ్యమతిం డతి శుద్ధుఁడై లెలెర్. ౨౫౫

తా. వేదాంతమునఁ బరిచయము గలిగి, నిష్కళ తత్త్వసేవ యందా సక్తి గలిగి సహజ సుఖస్వరూపుఁడగు యోగీశ్వరుఁ డేకర్మములు చేసినను భూమియందు యకారణముగ నశించును.

ఉత్సాహవృత్తము.

సుకృతదుష్కృతముల చేతఁ • జుట్టఁబడక యాశ్రయం
బొకటిఁ దనకులేక నిష్క • ళుండు నష్టబుద్ధియుం
బ్రకటితా మనస్కమున వి • భాసితుండునైన దా
ప్రకృతిభావ ముక్తుఁ డగుచుఁ • బరమయోగి సుఖియగున్. ౨౫౬

తా. పుణ్యపాపములకు లొంగని వాఁడయి, నిరాశ్రయుఁడయి బుద్ధి రహితుఁడై

ను యమనస్కము నాశ్రయించి యోగీంద్రుఁడు ప్రకృతిభిన్నుఁడయి సుఖియగును.

తే. గీ. సకల మానవులకు మాన । సంబెకాదె
కారణం బగు బంధ మో । క్షంబులకును
బంధమునఁ గడు విషయ సం । బంధమైన
ముక్తియగునది విషయ ని । ర్ముక్తమైన. ౨౬౧

తా. సమస్త జనుల బంధమోక్షములకు హేతువైనది, మనస్సుగాని వేరొకటిగాదు. విషయ సంబంధమున బంధమును, విషయత్యాగమున ముక్తియు గలుగును.

వ. సచరాచర మాయంబైన సర్వప్రపంచంబును మనోన్మన్యాఖ్యంబు మనంబున్మనీ భావంబైన నాసర్వంబు నద్వైత భావం బగుఁ గావున మనోన్మనీ సమేతుండైన మహాత్ముండు పర తత్త్వంబై యుండుట కేసందియంబు లేదతండు తనమహామాయంబు మఱుఁగున బాలోన్మత్త పిశాచ వర్తనుండును నానా వేష ధరుండునై యుండును జపములలోన నాదంబును ధ్యానంబులలో శిరోలంబంబును ముద్రలలోన ఖేచరియును నవస్థలలోన మనోన్మనియు నుత్తమంబులు.

తా. చరాచరంబగు నీజగమంతయు మనస్సుచే జూడబడు చున్నది అట్టి మనస మమనస్కము నాశ్రయించినచో సమస్తము, అద్వైత భావము నొందును. మనోన్మనితోఁగూడిన పరశివుఁడే పరతత్త్వము, అతండు తన మాయచే బాలోన్మత్త పిశాచులవలె సంచరించును. నానావేషములు ధరించును. ముద్రలలో ఖేచరీ ముద్రవలె అవస్థలలో మనోన్మని యుత్తమంబు.

సీ. అమనస్క గరిమ ను । దాసీనుఁడైయున్న
పరమ యోగీంద్రుని । భవ్యదేహ
మున మృదులలఘుత్వ । ములు సంభవించుఁ దై
లంబును వలను ఘృ । తంబు వలను
స్వేదవర్తనమును । జేయంగ వలదందు
నమనస్క మనెడిది । వ్యాపకంబు
గల్గియుండినజాలు । ఘనమైన మార్గము
బభినవంబును గల్గు । నదియుఁ గాక

తే. గీ. యాతని కధిక తృప్తియు నరో । గతయు నల్ప
తర పుష్ప మూత్రాలిలేయు నా । త్మ ప్రసన్న
తయు మితాశనత్వము తను । దార్ఢ్యమును న
జాడ్యనిద్రయు సిద్ధించు । సంతసమున.   ౨౬౨

తా. అమనస్క సిద్ధివలన నూరకయున్న యోగీంద్రుని దేహమున మ్రుకల ఖుర్వి
ము సహజముగానే సిద్ధించును. నూనెగాని నెయ్యిగాని శరీరమార్దవమునకై పూసికొనన
వసరము లేదు. ఈ యమనస్కము దివ్యామృతము. ఇది దగ్గర నున్నచో, తృప్తియు, నీ
రోగత, ఆత్మ ప్రసన్నత్వము, మితభోజనము, శరీరదార్ఢ్యము, జాగరూకతయు గలుగును.

వ అట్టి సహజాభ్యాసికి మన స్థిరత్వంబును వశానిలత్వంబును దృ
క్చాంచలత్వంబును నిరంతర బ్రహ్మానందంబును నిరాయాసంబును
గలుగుటం జేసి యశంపాసన ముంద్రబంధన కరణ వాయు నిరోధం
బులను నింద్రియ దమనంబులును నేకవిధ ధ్యానదృగ్దృశ్య పరికరంబు
లు నాదిమైన కృత్యంబులుడిగి యభీష్టగతి వర్తింపుచుండు. వెం
డియు నమ్మహానుభావుండు క్రమంబున నణిమాద్యైశ్వర్యంబులం
బొందును.   ౨౬౩

తా. ఇట్లు సహజాభ్యాసియైన యోగికి మనస్సు స్థిరత్వము నొందును. వాయు
వు స్వాధీన మగును. దృక్చాంచల్యము గలుగును. బ్రహ్మానందము గలుగును. కావున
నాతడు, వాయు నిరోధము, ఆసనము, మొదలగు నవి విడిచి స్వేచ్ఛగా బ్రవర్తింపు
చుండును. అట్టి వాడు క్రమముగా నణిమాద్యష్టైశ్వర్యముల నొందును.

మ. అమనస్కంబున గాలమొక్క క్షణమం । తైనం బరిక్షీణమై
న మహాశ్చర్యముగాగ గామముఖబం । ధంబుల్ వెసం దెస్సివ్వభ
గ్నములై లోపల నాలుగంగములనం । గంబుబులుం దెళ్ళు నా
సమయంబందు శరీరమన్ గృహము వి । స్రస్తంబగున్ యోగికిన్.

తా. ఎవనికి నమనస్కముచే క్షణకాలమైన నసుగడమునో, అతనికిం గామాది బం
ధము లుండనేరవు. అవి భగ్నములగుచో లోని నాలుగంగములకు అంతఃకరణ చతుష్ట
య మనెడి స్తంభములును భగ్నములగును. అట్టి సమయమున నిరాధారమై శరీరమను
గృహంబు కూలిపోవును.

సీ. అనిశంబు దుఃఖదా । యకమైన యంతఃక
రణశల్యమునకు భో । రన విశల్య
కరణౌషధంబు ని । క్కంబుగ నమనస్క
మగు నెందునైన న । న్యంబు లేదు
కదళిచందంబునఁ । బొడలి మహామాయ
కెందంబు దానినిఁ । గందమయ్యె
నాకులేంద్రియములఁ । దాకులయ్యె నదిదా
నమనస్కమనుఫలం । బారబండి
తే. గీ. యంతసంక్షీణమై పోవు । నారయంగ
మనసు మిగుల స్థూలంబు సూ । క్ష్మంబు దూర
గంబు దుర్లక్ష్య మమనస్క । ఘన శరమున
నప్రమత్తత నవిభేద్య । మగురయమున. ౨=౫

తా. మహామాయ, యరటి చెట్టువలె నున్నది. దానికి దుంప, మనస్సు ఇంద్రియములాకులు. అమనస్కమే ఫలము. అదపండిన వెంటనే చెట్టుకొట్ట బడుచున్నది. కాని దుంప యాలాగే నిలచి యున్నది. జాగరూకతచే యోగియగు వాఁడు సూక్ష్మమై దుర్లక్ష్యమై యున్న దానిని యమనస్క బాణమున ఛేదించి వేయవలయును. దుఃఖ ప్రదమైన మనస్సనెడశల్యముల దీసివేసి యదుకుటకు, అమనస్కము విశల్య కరణి వంటిది.

వ. అంగుళ్యగ్రసంస్థితంబైన దండంబు తెఱంగున నిటు నటుఁగదలుమనంబు నెట్టకేలకుఁ డిరంబగు నొకానొక యుక్తి యోగంబున.

తా. వ్రేలి చివర నుంచిన కఱ్ఱ యూగులాడు నటుల నటునిటు జరుగు మనస్సొకానొక యుక్తితోఁ గట్టు వడును

క. ఎచ్చటి కేగున్మానస
మచ్చటన వసింపఁజేయు । నది లయమొందుర్
గ్రచ్చరవాఁత మగునేఁ
బెచ్చు బెరుఁగు నమ్మనంబు । పెక్కువిధములర్. ౨=౬

తా. మనస్సు యెచ్చటికి వెళ్లునో దానినచ్చోట నిలువ నుంచినచో లయించును. లేదా యెక్కుడు పూర్వము కంటె నెక్కువగా వెళ్లిన చోటికి పోవుచుండును.

క. మానసము స్వేచ్ఛఁ జనిచని
తానమరల సేగుదెంచుఁ దన నెలవునకున్
బూని నిరంకుశ విధిచే
నేనాఁట మదించినట్టి యేనుఁగు పోలెన్. ౨౯౮

తా. మదించిన యేనుఁగు దానుస్వేచ్ఛగానడవి యంతయుఁ దిర్గితిరిగి తనస్వస్థానమునకుఁ జేరునటులమనస్సుగూడ స్వేచ్ఛగానటులే చనితిర్గితనస్థానమునకేగు దెంచును.

ఉ. శ్రాసు హిరణ్యకారకుఁడు దప్పక చేతను నిశ్చలంబుగా
వేసటలేక నిల్పు సరవింగను నేర్పలరంగ సంతతా
భ్యాస మనఃప్రవర్తనము నాత్మ దిరంబగుచుండు నట్లుగాఁ
జేసి నిజాంతరంగమునఁ జెందు నిరంతర తత్త్వసౌఖ్యమున్. ౨౯౯

తా. అగసాలి త్రాసును వ్యత్యాసములేక సరిగా నిల్పునటుల నిరంతరాభ్యాసమున-మనస్సు నడనడిని నాత్మయందు స్థిరంబుఁగాశేసి యెల్లప్రుడుయోగిసౌఖ్యమును జెందును.

తే. గీ. ఇంద్రియ గ్రాహ పదముల నేర్పుమిగిలి
శ్వాస నిశ్వాస దీర్ఘప క్షములు మిగిలి
పట్టువడక పారెడి మనః పక్షి చిక్కి
పడుఁ గదలలేక పదపక్ష భంగమైన. ౩౦౦

తా. ఇంద్రియములనెడి పాద మూలచే నడుచుచు నుచ్ఛ్వాస నిశ్వాసముల నెడిరెక్కలుగల మనస్సనెడి పక్షికాళ్ళు రెక్కలు విరుగ గొట్టిన నయ్యది యొకచోటనే పడిపోవును.

సీ. శ్వాసంబులను సూత్ర శతములు నింద్రియ
సముదాయమనెడి పూ సలును గలిగి
గొనకొన దనుగ్రమ్మి కొనియున్న మానసం
బనియెడి వలఁద్రెంచు కొని ముందమున
జీవుఁడ న్మత్స్యంబు సేమమారఁగ సుఖ
వననిధి లోపల మునిఁగి యుండు
మాఱియును దుర్బుద్ధి మత్తమాతంగుఁడు
ననిల తురంగుండు నంగరథుఁడు

తే. గీ. ప్రకటితేంద్రి యోజ్వల భటాళి పరివృతుండు
నగు మనః పరిపంథి జో కర్యముగ గెల్చి
ప్రథు విభూతి శ్రేయః పుట భేదనమున
బురుషుండుండు శాశ్విత సుఖ స్ఫురితుండగుచు. ౧౭౧

తా. శ్వాసముల నెడిదారములును- ఇంద్రియ సమూహ మనెడి పూపలును గలిగి తన్నావరించి యున్న మానసమనెడి వనము ద్రెంచుకొని- జీవుండను చేప సుఖసముద్రమున మునిఁగియుండుచు. బుద్ధిగజమును- వాయువను గుఱ్ఱమును- శరీరమను రథమును నింద్రియములను భటులును గలిగి యొప్పుచున్న మనస్సనెడి శతృవును- జయించి మహానిశ్వైర్యము- శ్రేయస్సు- అనెడి పట్టణమందు- బురుషుండు మహోల్లాసముతో నివసించును.

క. మును జీవుండు గుణత్రయ
మను ముప్పురి త్రాట బద్ధుండై యుండును ద
ద్ఘన రజ్జువు సమనస్కం
బనుకత్తిం గోసి ముక్తుండగు నతండెలమిన్. ౧౭౨

తా. గుణత్రయమును ముప్పురి త్రాళ్ళచేఁ గట్టబడిన జీవుండాత్రాళ్ళను సమనస్కమను కత్తితోఁ గోసి ముక్తుఁడగును.

క. కమలాప్తుండస్తమించిన
సమయంబున నతనియందు సరిఁ దత్కరజా
లము తడయ కణఁగు కైవడి
నమనస్కమునందు లీనమగు నఖిలంబున్. ౧౭౩

తా. సూర్యుండస్తమించినపుడు సూర్యునితో బాటు నాతనికి రణంబు లణఁగు విధంబున సర్వంబును నమనస్కంబున లీనమగును.

క. అంబరమున నుదకము బ
ద్ధంబగుచు న్మారుతమ్ము తాఁకున సంచా
రంబొనరించుగతి నసం
గంబగు నమనస్క మొనరఁ గాంచియుంచున్. ౧౭౪

తా. ఆకాశమున ఘనీభవించిన జలమువాయువు దెబ్బచేత సంచరించు నటులన

గరహితమగు నమనస్కముగూడ చరించును.

మ. అమలంబై యభిరామమై యనుపమంబై యింద్రియ గ్రాహ్యశూ
న్యమునై సత్యనివాతమై శివకరంబై భిన్నమై యుండు న
య్యమనస్కాఖ్య మహాహ్రదంబున ముదంబారంగ స్నానంబుసే
సిమహాసంగుడు యోగి వొందున మృతస్వీకార తాసౌఖ్యముల్

తా. ఏ యోగీంద్రుఁడు నిర్మలమును- నిరుప మానమును-. మంగళ కరము నగు నమ
స్కమనెడి మడుగునందు స్నానము చేయునో, అతండ మృతస్వీకారము వలన గలిగెడి
సౌఖ్యము నొందును.

క. అమితాయాసము నమన
స్కమునగు సకలంబు విడువఁ జను నప్రాయా
సము నమనస్కమునగు త
త్త్వము నిష్కళమున్ భజింపఁ దగు నెల్లపుడున్. ౨౭౪

తా. ఆయాస జనకమగు మనస్సు నందుఁ బరిశాలించు సకలంబు విడిచి శ్రమ లేని
యమనస్కము నాశ్రయించి నిష్కళతత్త్వము నారాధింపఁదగును

మ. అరుదొందన్ వర శిష్యులాదు నమన స్కానంద మందంద మె
వ్వరు సంపూర్ణముగా నొనర్చి పిదపన్ వారింతు రయ్యింద్రియో
త్కరసంభూత సుఖంబు వారల మనస్కాభ్యుల్ జగంబందు స
ద్గురువుల్ వారితరుల్ ప్రతారకులు చేతోవ్యాధి నూహింపగన్.

తా. శిష్యులలో నమ నస్కానందమును మొదట సంపాదించి తరువాత నెవ్వరిం
ద్రియ సుఖంబు పరిత్యజింతురో, వారల మనస్కము నభ్యసించిన వారిలో శ్రేష్ఠులు. త
దితరులందఱు నూహింపఁగా వంచకులుసుమా.

శా. వేదాంతార్థ విచారులాదురు గదా విద్వజ్జనుల్ నాఁగఁద
ద్వాదంబేటికి నంతమాత్రన సుబోధప్రాప్తి గానేర్చునే
యాదిన్వారికి వేయునేలగురుపాక్యంబాత్మ నమ్మంగను
త్పాదిల్లున్ సహజామనస్కము ననంబంధంబు గల్గున్ వెసన్.

తా. పండితులు వేదాంత విచారణము చేయుచుందురు. గానియంత మాత్రమున తత్త్వము
తెలియునా; తెలియు నేరదు. గురువాక్యమును నమ్మినవారికే సహజామనస్కము సిద్ధించును.

క. ఘనుడమనస్కుం డొనరిం
చినకర్మములెన్నియైనఁ । జెడునో పెంపొక
ర్మనిరతుఁడైన నిలుపవా
తనియందవి యగ్ని కాష్ఠ । త తులనిలుచనే.

తా. అమనస్కుఁడు చేసిన కర్మములన్నియు వ్యర్థములై చెడిపోవునుగాని, యాతని యందు నిలువనేరవు అగ్నికట్టెల యందు నిలచి యుండునా?

మ. సతతాభ్యాస పరాయణుండు శుభక్రియుఁ । సంకల్పదూరుండునై
వితతానంద సమన్వితుండు విలస ద్విజ్ఞాన శీలుండునై
క్షితిలోనయ్యమనస్కుఁడైన శివయో । గిఁ సర్వకర్మంబుఁ బా
సితొలంగుఁ మదిదానయిట్లు వచి । యుంచెఁ శంభుఁడిపొందఁగ.

తా. నిరంతరాభ్యాస మొనరించుచు,సంకల్పము లేక యానందము మునింగి యమనస్కుఁడైన శివయోగిని సర్వ కర్మంబులు వదిలి పోవు ననిశంకరుఁడు వచించె.

క. అమనస్కసిద్ధిగలదాఁ
కముదంబున సద్గురుండు । గదియించినమా
ర్గమునన శివయోగాభ్యా
సముగావింపంగ వలయు । సాయమివర్యుల్. ౨౮౧

తా. అమనస్కసిద్ధిగలుగు నంత వరకు గురువు చెప్పిన మార్గమునసే శివ యోగము మునీంద్రు లభ్యసించు చుండవలెను.

వ. అమనస్కసౌఖ్యాతిశయంబు నందన్మయుండై సంసారధ్వంసనకరంబైన యవధూత వర్తనంబుగల వాఁడై కేవల నిరాశి యుండై యుండు నెవ్వండతండు జీవన్ముక్తుండు. ౨౮౨

తా. అమనస్కము వలన గలగాడి సౌఖ్యాతిశయంబున తన్మయత్వంబునొంది సంసారము నశింపఁజేయు నవధూతాశ్రమమునఁ జరించువాడు జీవన్ముక్తుఁడై యుండును.

ఆ. వె. అతఁడు బ్రహ్మయోగి । యాతఁడు శివయోగి
యతఁడు పరమయోగి । యారయంగ
నతఁడు రాజయోగి । యతనికిసరిరాదు
నధికులైన. వారు । నవని లేరు. ౨౮౩

తా. బ్రహ్మయోగి, శివయోగి, రాజయోగియు నాతఁడే సుమీ? ఆతనికి సమాను లెవరునులేరు.

వ. అతం డివ్విధంబునఁ బరశివ తత్త్వవిలీన మాన సుండును నఖండ జ్ఞాన సంపన్నుండు నగుటఁజేసి విధిని షేధా తీత వృత్తి నాజ రించు చుండు నమ్మహాత్మునకు శ్రుతిస్మృతి పురాణాగ మశాస్త్ర జాలం బులు పూజాగ్ని కార్యజపదాన తపోముఖ కృత్యంబులు నేటికి? ప రమ పవిత్రుం డతండు. ౨౮౪

తా. ఈవిధముగాఁ బరతత్త్వమున విలీనమైన మనస్సుగల యాతఁడఖండజ్ఞానము కలిగి నవాఁడగుటచే నవిధిని షేధముల నతిక్రమించియుండును. పరమ పవిత్రుఁడగు నతనికి వేదాగ మాదులుగానిఁ జపగాన పూజాదులు గాని యెందుకు?

తే. గీ. ధరణికిని బావకు నరుఁడ। తత్త్వజ్ఞునకును
దలఁచిచూడంగ విధినిషే। ధములుగలవె
వారలెట్లున్నఁ బూజ్యులు। వారినొండు
భావనఁదలంచి పలుకుట। పాతకంబు. ౨౮౫

తా. భూమి. అగ్ని- తత్త్వజ్ఞుఁడు పరమపవిత్రులు- వారికి విధిని షేధములు లేవు, వారలెటులున్నను బూజనీయులే. మరొకవిధంబున భావించి వారిని బలికినచో బాతకము సంప్రాప్తించును.

క. తనువెఱ్ఱి వాఁడనుచు భూ
జనులెల్ల హసంగ నీచ। సంసారము వా
రని తాను గనుంగొని కనుఁ
గొనల నగుం దత్త్వపార। గుండాగి వారిన్. ౨౮౬

తా. తత్త్వజ్ఞుఁడు తన్నితరులు చూచి వెఱ్ఱివాఁడని నవ్వుచుండ, దాను వారినిగాంచి నీచసంసారమునకు జేరిన యవివేకులని నవ్వుచుండును.

ఉ. భోరున భేదభావములుఁ। బుణ్యముఁ బాపము సంశయంబు శా
రీరమనః ప్రవృత్తుల ప। రిభ్రమ తృష్ణను బాసియెవ్వడే
ధీరుని నిర్గుణంబ యున। తత్త్వము తోవఁజరించు చుండునా
ధీరునకేల గల్గును మ। తిం దలపన్ విధియు న్నిషేధముల్.

తా. భేదభావములు లేక పుణ్యపాపములు- శరీర సంబంధమును మనో వ్యాపారములు- అన్నియు వదలి యేమహాత్ముఁడు నిర్గుణతత్త్వము మార్గమున సంచరించు చుండునో, అట్టివానికి విధి నిషేధము లేలగల్గును?.

## —✻ రాజయోగి ప్రవర్తనము ✻—

వ. అట్టి రాజయోగీశ్వరుని వర్తనం బెట్టిదనిన. ౨౮౮

తా. అట్టిరాజయోగి నడవడి యెట్టిదన గా.

ఉ. పెక్కులు ప్రేలఁ డెన్నఁడును। క్షేమి సంపద నొందెనేని
నిక్కఁడు దుర్దశల్ కదిసి। నల్పినయేని మనంబు లోపలన్
స్రుక్కఁడు సర్వభూతములఁ। జూచి నిజాత్మయ కాదలంచును
క్కెక్కఁడు రాజయోగియతిఁ। డెయ్యెడ దీనుఁడుగాఁడు ధాత్రిలోన్

తా. అతఁ డధికముగా భాషింపఁడు. సంపదలు గలిగినను గర్వింపఁడు. కష్ట దశ సంప్రాప్తించిన మనంబునందైనను జంకడు. సర్వ భూతములను దనయాత్మగా నెంచును. ధైర్యముతో నుండును.

క. దేవరయని కొనియాడిన
నావల నంత్యజుని కంటె। నధముఁ డనుచునా
నావిధముల దూషించినఁ
గేవల మతిరాజయోగి। కిన్ సమమయగున్. ౨౯౦

తా. రాజయోగి తనను దైవమనికొని యాడినను- చండాలుఁడని దూషించినను సమానము గానే తలంచును.

క. దేహాభి మానములు లే
వాహార విహార విధుల। కనురక్తుఁడుగాఁ
డాహా పుట్టదు మదిలో
నూహింపఁగ నెప్పుడురాజ। యోగీంద్రునకున్. ౨౯౧

తా. దేహాభి మానము లాతనికి లేవు ఆహార విహారము లందాతనికి ప్రేమలేదు. వి చారింపఁగా నాతని కెప్పుడును మనంబున నెట్టికోరికలు జనింపవు.

క. వేదాది విద్యలొల్లఁడు
బోధనములకుఁ జొరఁడు విషయ । వాంఛఁ దగులఁడే
భేదము నెఱుఁగఁడ టిందుగ
దాదృశ తరరాజయోగి । తత్త్వార్థగతీ. ౧౯౨

తా. వేదాది విద్యలనాతఁడు నేర్వఁడు. వాద ములకుఁ బోఁడు. విషయ లోలత్వమును విడుచు. భేదము లెఱుంగఁడు. అట్టివాఁడుగదా రాజయోగి యందురు.

క. శంక యొకింతయు నెఱుఁగఁడు
సంకల్ప వికల్పబుద్ధి । జరగఁడు మదినే
వంకకుఁ జొనుపఁడు మతినా
హంకారుఁడు రాజయోగి । యండ్రార్య జనుల్. ౧౯౩

తా. అతినికి సందేహము లేదు. సంకల్ప వికల్పములు లేవు. మనస్సు నెటుపోనీ
వడు. అహంకార శూన్యుఁడు.

ఆ. వె. తెలిచి మఱచినట్లు । చేష్టలు చెడియెద్ది
యైనఁగుడిచి యెద్ది । యైనఁగట్టి
యెచటనైనఁ దిరిగి । యెచ్చోట నైనను
నుండునతఁడు రాజ । యోగి వరుఁడు. ౧౯౪

తా. తెలిసికొని మరచిన విధఁబున- నాతఁడెచట నోతిని, యెచట నోయుండి యేదియో గట్టుచు స్వేచ్ఛగా జరించును వాఁడే రాజయోగి యనఁబడును.

క. యోగి గనుఁగొనిన ఫల మఖి
లాగమములు చదివి సురల । నందఱఁబూజల్
బాగుగఁ జేసి యథావిధి
యాగశతముఁ జేయు కంటె । నగుఁదథ్య ముగన్. ౧౯౫

తా. అన్ని శాస్త్రములు చదివి నందఱిని పూజించిన ఫలము రాజయోగిని గనుగొన్నంత మాత్రింబుననే గలుగును.

క. అతనితో భాషించిన
నాతనికి భిక్షబెట్టి । యసుదిన ధంబో

నాతనిఁ గొలువఁగఁ గలిగిన
యాతని సౌభాగ్య మింత ◆ యాతనిఁ దరమే. ౨౯౬

తా. ఆతనితో మాటలాడినను- నాతనికి భిక్షము పెట్టినను- నతని సేవించు సౌభాగ్య మబ్బినను- నట్టివాని పూర్వ పుణ్యము వర్ణింపఁ దరముగాదు.

మ. దివసంబైన దినార్ధమైన మఱియే ◆ దేశంబు నందుండుఁదా
శివయోగీశ్వరుఁ డయ్యెడన్ ఖచరులున్ ◆ సిద్ధోరగానీకముల్
వివిధ వ్రాతము కాలభైరవుఁడును ◆ ర్థిన్ రక్షణార్థంబుగా
సువిశేషస్థితి నిల్తురెప్పుడు గడుం ◆ జోద్యంబుగా నెల్లెడన్.

తా. రాజయోగి, యొకపగలుగాని, యొకపూటగాని, యేదేశమందుండునో యచ్చట దేవతలు- కాలభైరవుఁడు- సిద్ధులు మొదలగువారందఱు- నాదేశరక్షణార్థమై యుండుదురు.

—* శివయోగిమహిమ. *—

వ. మఱియు నమ్మహానుభావుండైన శివయోగీశ్వరుండున్న యచ్చట గంగాది సమస్త పుణ్యతీర్థంబులును మూర్తిత్రయంబును, మూఁడు వేదంబులు నుండుటం జేసి తద్దేశం బవిముక్తస్థలంబై సకలతీర్థఫలంబై యధిక తపోవనంబై సర్వమంగళాస్పదంబై విలసిల్లుచుండును. అఖిల జగన్మయుండైన శివుండకదా శివయోగీశ్వరుఁ డతఁడు ప్రసన్నుండైన నపరిమిత శుభంబులగుం గావున మహాఫలార్థులైన సజ్జను లతనిం గని ప్రయత్నంబునం బూజించు టొప్పును. అతని యుదరంబున నెవ్వండిడిన యన్నంబు జీర్ణించు నతఁడు తన పూర్వాపర కులీనుల నిరువదేసి తరతరంబుల వారితోడం గూడి సంసార సాగరంబు తరించుటం గల్గు నదియుం గాక యజన యాజ నాధ్యయనాధ్యాపక దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన విప్రోత్తములకు నూఱు లక్షలకు సాంగంబుగా భోజనంబుఁ బెట్టిన ఫలంబు శివయోగికి భిక్షమాత్ర ప్రదానంబున సిద్ధించు నీయర్థం బానూన యాధ్యంబు. శ్రీ

తా. మహాత్ముడైన రాజయోగి యున్నచోటు, గంగాది తీర్థములు. త్రిమూర్తులు నుండుటచే నయ్యది కాశీనగరంబుం బోలె సర్వమంగళ ప్రదంబై విలసిల్లును. శివయోగి యాశివుండే యగుంగావున నాతని పూజించుటవలన సకల శుభంబులు సంభవించును. శివయోగి కన్న మెవ్వండధికుండో, అట్టి యున్నమా శివయోగి కడుపున జేర్గించు వంకలో నాతని పూర్వాపర కులీశులు సంసారము నుండి తరింతురు. ఒక్క శివయోగికి భిక్షము పెట్టినంత మాత్రముననే కోటి బ్రాహ్మణుల కన్న దానము చేసిన సుకృతంబు గలుగును. ఇది వేద ప్రసిద్ధంబు.

క. సురపితృ గురులను యోగీ
శ్వర సహితముగా భజింప ♦ జను శ్రాద్ధములన్
వరయోగి లేమిం గద భూ
సురులు నమస్కార మంత్ర ♦ సూక్తి చదువుటల్. ౨౯౯

తా. శ్రాద్ధ కాలంబున దేవతలను పితృదేవతలను గురువులను శివయోగులతోఁ గూడ సేవింపఁ దగును. యోగీంద్రులు లభింపకనే భూసురులు నమస్కార మంత్రములుమాత్రము చదువుదురు.

తే. గీ. శ్రాద్ధ కాలంబు ననుయోగి ♦ జనములోన
వెదకి తేఁ దగు శివతత్త్వ ♦ విదుని వేడ్క
నతఁడు సిద్ధించెనేని త ♦ త్పితృ పితామ
హాదులాడుదుఁ బాడుదు ♦ రతిముదమున. ౩౦౦

తా. ఎట్టైనను శ్రాద్ధ కాలంబు నను శివతత్త్వ వేత్తను వెదకి తే వలయును. ఆతఁడు లభించినచో, పితృపితామహు లందఱు నృత్యము చేయుచుందురు.

క. శివయోగి భుజించిన శ్రా
ద్ధ విధిగలుగు దాకభుక్తి ♦ తత్పర తృష్ణా
వివశులు పితరులు శివయో
గి విహీన శ్రాద్ధములుస ♦ కిల్బిషములగున్. ౩౦౧

తా. శివయోగికిఁ బెట్టునంత వఱకు పితృదేవతలు తృష్ణాపీడితులగుచుందురు. శివయోగిలేని శ్రాద్ధములు- పాపభూయిష్ఠములు.

ఆ. వె. అరయ నిట్లగుటను ♦ సుర పితృ నిత్యనై
మిత్తికాది విధుల ♦ సత్త్రిపూజ.

సేయవలయు బుధుఁడు • శివయోగిఁ దద్దాన
మణుపు సదృశమైన నక్షయంబు. ౩౧౩.

తా. కాఁబట్టి సురపిశృ నిత్యనైమిత్తి కాదులందు శివయోగులను బూజింపవలయును. శివయోగి కొసంగిన దాన మణుమాత్రమైనను నక్షయ ఫలప్రదంబగును.

చ. అతులిత చిత్సుఖామృత ర • సాంబుధి నెవ్వని మానసంబు మ
గ్నత బొరయుం దదన్వయ మకాను • జగంబున సత్పవిత్రమా
తతముగ నాతనిం గనినఁ దల్లియు • నెల్లెడ భాగ్యవంతురా
లతని పదంబు మోపినయ • నంతయుఁ బావన మూర్తియెల్లెడన్

తా. చిత్సుఖామృత సాగరంబున నెవని మనంబు మునింగి యుండునో; అతనియన్వయమే కేవలము జగంబున పవిత్ర మగుటయగాక యాతని గన్నతల్లియు భాగ్యవంతురాలు. అతని పదము స్పృశించిన నంతనే మహాపవిత్రులగుదురు.

క. కావున శివయోగ జ్ఞా
నా వాసిత వాసనాస • మాకలితులనా
నావిధములైన మహిమలు
భావనఁ దలపోసి చూడఁ • బరమాద్భుతముల్. ౩౧౪

తా. శివయోగ జ్ఞానముతోఁ గూడిన వారి మహిమ లనేక విధములు. అవియన్నియుఁ జూడమిక్కిలి యాశ్చర్యము గలుగఁ జేయును.

క. శుక వామ దేవముఖ్యుల
వికలస్థితి నిట్టియోగ • విద్యాగరిమా
త్మకులగుటన కాదేత
త్కలిక జీవన్ముక్తులైరి • ఘనయశు లగుచున్. ౩౧౫

తా. శుకుఁడు- వామదేవుఁడు- మొదలుగా గలవారెల్లరు నీయోగ విద్యాప్రభావము వలననే జీవన్ముక్తులైరి.

క. మఱియుఁ దగు శైవవరుల్
నెఱవగు శివయోగ శీల • నియతిన కాదే
కఱకంఠు కరుణ వడయుచు
నెఱిమర్త్యన ముక్తులగుచు • నెగడుట జగతిన్. ౧౦౬.

తా. శైవాగ్రేసరు లనేకులు- శివయోగ శీలము నవలంబించుట వలననే పరమేశ్వరు కరుణ నొంది సంసారము నుండి ముక్తి నొందిరి.

సీ. ఈశ్వరోక్తంబైన । యీరాజయోగ మా
ర్గంబు జీవన్ముక్తి । కారణంబు
గాని యన్యంబును । గానేరదెందు ని
దియకదా సకలసి । ద్ధి ప్రదంబు
చర్చింప సర్వద । ర్శన సమ్మతంబగు
నిదియు వేయును జెప్ప । నేలబుద్ధి
మంతుల కిదియని । రంతరంబును సేవ్య
మిదియు మహాలాభ । మదియుఁ గాక
తే. గీ. మంత్రలయములు లారంభక । మహిత ఘటన
మాహ్వయంబుల చేతఁ బెం । పారు చుండుఁ
బరిచయంబగు హఠము వై । భవ మెలర్పఁ
బరఁగు రాజయోగంబుని । వృత్తి యనఁగ 302

తా. సర్వేశ్వరునిచేఁ జెప్పఁ బడిన యీరాజయోగము జీవన్ముక్తికి హేతువు. సకల సిద్ధుల నొసంగును ధీమంతులకిది యేసేవనీయము. ఈరాజ యోగ సిద్ధి గలిగిన- మంత్ర లయ హఠములు కరతలామలకము లైయుండును. మంత్రము- ఆరంభక మనియు- లయము ఘటమనియు- హఠము పరిచయ మనియును- రాజయోగము నివృత్తి యన్నియు వ్యవహరింపఁ బడుచుండును.

వ. ఇట్టి నివృత్తియోగ సంపన్నులైన కృతార్థుల కాధ్యాత్మికాధి భౌతిక దైవికంబులను తాపత్రయంబును, పంచ క్లేశంబులును, షడ్భావ వికారంబులును షడూర్ములుం గలుగవు. ఆధ్యాత్మిక తాపంబనంగ నిజశరీరజనితాధివ్యాధిక్లేశంబు నాధిభౌతికతాపంబనంగ నింద్రియజనితంబాధిదైవతంబనఁగ స్వర్గ నరకాది క్లేశంబాదిగఁ దాపత్రయంబులును, ద్రష్టృదర్శన దృశ్యంబులును జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భోక్తృభోగభోగ్యంబులునను నవవిధవ్యవహార భావంబులును, త్వఙ్మాంసశోణితాస్థి స్నాయుమజ్జలను షట్కౌశికంబులను, గామక్రోధలో

భ మోహామద మత్సరంబులను నరిషడ్వర్గంబులును, అన్నమయ-
ప్రాణమయ- మనోమయ- విజ్ఞానమయ- ఆనంద మయంబులను
పంచకోశంబులును, అస్తిత్వ జనన వర్ధన పరిణామ క్షయ వినా
శంబులను షడ్భావ వికారంబులును, క్షుత్పిపాస శోక మోహ జ
రామరణంబులగు షడూర్ములునుగలుగమిం జేసియుమ్మహాత్ములుని
త్యానందులై యుండుదురు. రెండియు.

తా. ఈగాజ యోగులకు- తాప త్రయము గాని షడూర్ములు గానిలేవు. తన
శరీరమునం బుట్టిన వ్యాధివ్యాసుల ధ్యాత్మిక తాపమనియు, స్వర్గనరకాదులు దైవిక మల
నియు వచింపం బడును.

షట్కోశికములు- త్వక్కు- మాంసము- శోణితము అస్థులు- స్నాయువు- మజ్జ
అరిషడ్వర్గము- కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములు-

షడ్భావ వికారములు, అస్తిత్వము, జననము, వృద్ధి పరిణామము. క్షయము
వినాశము.

షడూర్ములు, క్షుత్పిపాసలు, శోకమోహములు, జరా మరణములు,

పంచకోశములు.

కోశమనగా సంచి. కత్తిని వరగప్పి యున్నట్లు నావరించి యుండునది యేకోశమ
న బడును.

పంచకోశములు ప్రాణమయ కోశము- అన్నమయ కోశము- మనోమయ కోశము-
విజ్ఞానమయ కోశము- ఆనందమయ కోశము.

అన్నమయ కోశము.

అన్నవికారశుక్ల శోణిత జన్యషడ్భావ వికారసహితం
అన్నేనైవ వర్ధమానం ఇదం స్థూల శరీర మన్నమయ కోశః॥

అన్నముచేబుట్టి అన్నముచేవృద్ధి నొందుచు షడ్భావ వికారములు గలిగి యున్న
యీస్థూల దేహమే యన్నమయ కోశము.

ప్రాణమయ కోశము.

ప్రాణాది పంచకం ప్రాణమయః కర్మేంద్రియైర్యుతం
ప్రాణాది పంచవాయువులతోడను- ఉప వాయువుల తోడను- కర్మేంద్రి
యములతోడను గూడి ప్రాణ మయకోశమన బడును

మనోమయ కోశము.

మనోజ్ఞానేంద్రియైర్యుక్తం మనోమయ ఇతీరితః॥ మనస్సుజ్ఞానేంద్రియములతో

గూడినచో మనోమయకోశమనఁబడును.

విజ్ఞానమయకోశము.

బుద్ధిర్జ్ఞానేంద్రియైర్యుక్తః విజ్ఞానమయ కోశః॥
బుద్ధిజ్ఞానేంద్రియములతోఁ గూడినదివిజ్ఞానమయకోశము.

ఆనందమయ కోశము.

ప్రియమోద ప్రమోద వృత్తి మదజ్ఞానప్రధాన మంతః కరణం ఆనందమయ కోశ ఇత్యుచ్యతే॥

ప్రియము- మోదము- ప్రమోదము- అనెడి వృత్తులతోఁ గూడికొని యజ్ఞానమే ప్రధానముగాఁ గలయంతఃకరణమే యానందమయకోశమనఁబడును.

ప్రియము- పదార్థముల చూచిన వెంటనే గలుగును.

మోదము- తనకిష్ట పదార్థము లభించిన తర్వాత గలుగు సంతోషము

ప్రమోదము- తానను భవించిన పిమ్మట తనకు గలుగు సంతోషము.

ఈపంచ కోశములు క్రమముగా నుండును. వీని పైన హిరణ్మయ కోశము గలదు. అదియు నశించినపుడు నామరూపక్రియారహితమగునచలపరిపూర్ణమేమిగిలి యుండును.

పదార్థములేమియులేకపోవుటచేతనే రాజయోగులునిత్యానందముగలిగి యుందురు.

తే. గీ. అంధకారంబు సూర్యోదయమునఁ బాయు
చందమునఁ గడురయమునఁ । సర్వకర్మ
సముదయము శివజ్ఞానోద । యమునఁ బాసి
చనఁగ మతిముక్తిఁ బొందును । స్వాత్త్రియోగి. ౩౦౮

తా. సూర్యోదయమువలన నంధకారము నశించునటుల సర్వ కర్మ సమూహము శివజ్ఞానమున నశించును. కావున రాజయోగి ముక్తినొందును.

ఉ. కావున ముక్తి సిద్ధికి స । కల్మషవృత్తి బుధుండు సర్వవి
ఘ్నావలులన్ జయించి తన । కబ్బెడుయోగ సముద్భవాది నా
నావిభవంబులందును మ । నంబును రక్తివహింపనీక స
ద్భావన నభ్యసింపఁదగుఁ । బాయక యీశివయోగ మిమ్ములన్

తా. ముక్తి గోరువాఁడు సత్ప్రవర్తన గలిగి, విఘ్న సమూహమును జయించి, తనకుఁ గలిగెడి సకల భోగము లందును మనస్సు పోనీయక సద్భావన గలిగి యీశివ యోగము నభ్యసింపదగును.

క. శివభక్తి వృద్ధిఁ బొందుచు
శివ ప్రసాదాతిశయము । సిద్ధించును భ
ర్భవ జలధి దాటఁ గలుగున్
శివయోగాభ్యాస నిరతి । శిష్టాత్ములకున్. 3౧౧

తా. నిరంతర శివయోగాభ్యాస వశమున, శివభక్తి వర్ధిల్లును. శివానుగ్రహ పాత్రుఁ డగును. సంసారము దాటఁగలడు.

వ. ఇట్టి శివయోగ ప్రకారంబాగమ పురాణసిద్ధంబై - విశుద్ధ కృత్యం
బై - ధ్యానజ్ఞాన మయంబై యొప్పు చుండు గావున. 3౧౨

తా. ఈశివయోగ విధానము, ఆగమ ప్రసిద్ధము. ధ్యాన జ్ఞానమయము.

—* ధ్యానజ్ఞానకృత గ్రంథప్రాశస్త్యకథనము *—

క. ధ్యానజ్ఞాన మయవ్యా
ఖ్యానంబై యిట్టి కృతిస । ముచితమయ్యెన్
మానుగ సంక్షేపంబుగ
నేనుఁగు దర్పణము నందు । నేర్పడు భంగిన్. 3౧3

తా. మహోన్నతమగు గజంబు, అద్దమునందుఁ బ్రతిఫలించు నటుల, మహా ద్విషయముల సుధ్యాన జ్ఞానములకీ కృతి వ్యాఖ్యానమై తనరినది.

సీ. ధ్యాన విజ్ఞానము । లాయజ్ఞములు రెంటి
సారచర్యలు సదా । చారులెల్ల
నలరఁ జెప్పును రెట్టులన్న । వేదాంతోప
నిషదాగమాదుల । నిర్ణయార్థ
మై శివయోగంబు । నాశైవ జనపరి
గ్రాహ్యమై పరఁగును । రాజయోగ
మదియ సమస్తంబు । నందు సారముగాన
సద్గురు కరుణనా । సరణిఁ దెలిసి

తే. గీ. యాత్మలింగావలోకనా । యత్తచిత్తుఁ
డై తదాభ్యాస గరిమ సం । యమి వరేణ్యుఁ
డంత సమనస్క సౌఖ్యవి । శ్రాంతి నొంది ౩౧౮
యవ్యభితముగ జీవన్ముక్తు । డగుట మేలు.

తా. ధ్యానజ్ఞాన యజ్ఞములు రెండును గొప్పవి. వేదాంతాగమాదులచే నిర్ణీతమై శైవజన గ్రాహ్యమై యలరు శివయోగ మే రాజ యోగమనఁ బడును. సర్వసారంబగు నీ రాజ యోగంబు సద్గురు కరుణా కటాక్షమునఁ దెలిసి కొనవలయును తెలిసినంత నేయాత్మలింగావలోకనము నందే చిత్తము నుంచి నిరంతరము సేవించు చున్న సమనస్క సౌఖ్యము గలుగును. అందువలన జీవన్ముక్తుఁ డగును.

క. అవిరళ శివయోగాభ్యా
స వశంబున జగము దన్ని జముగ మఱచిన
ట్టి విధాభాసఁ గూడిన దాఁ
క నలయు వేదోక్త కర్మ కగణనము సంగన్. ౩౧౯

తా. శివయోగాభ్యాసవశమున జగమందలి భ్రాంతినశించునంతవరకు వేదోక్త కర్మలాచరించవలెను.

క. ఆకర్మతపోజపము
జ్ఞాకరమై పూర్వభావ । మమరుట నదియా
లోకించి యిప్పవిమల చ
ర్యా కలితుండగుచు నచలి । తాధిక భక్తిన్. ౩౨౦

తా. కర్మము, తపము, జపము, పూర్వభావమని యెంచి, విమలమగు చర్యాపాదమునవలంబించి మిక్కిలి భక్తితో.

శా. సర్వేశుం బరమాత్ముఁ జిన్మయు శివున్ । శర్వున్ సహాదేవునిన్
సర్వాధిష్ఠితు నవ్యయున్ హరునుమా । సంయుక్తదేహున్ మృడున్
సర్వజ్ఞున్ హరిపూజితాంఘ్రి కమలున్ । సద్భక్తిగమ్యున్ శివున్
సర్వాధారున పారమోక్ష సుఖదున్ । శంభున్ భజింపందగున్.

తా. సర్వేశ్వరుఁడును, ఉమాసహితుఁడును సర్వజ్ఞుఁడును, మోక్ష ప్రదుఁడు నగునీశ్వరునే సేవించవలయును.

—* గ్రంథపఠనాది ఫల నిర్ణయము. *—

తరువోజ.
ఉత్తమశివభక్తి యోగపథంబులొనరనయి యాశివ యోగసారమ్ము
నుత్తరభాగమ్ము నఘమార్గశాలి యనఁ జతురాశ్వాస యుక్తంబు
నగుచు
సత్త్వగుణ నొప్పి నిదివిమలుఁడై యేమానవుఁడు పఠియించిన విన్న
జిత్తంబలర లిఖించిన శివజ్ఞానశీల సంపన్నుఁడై చెలువొందుచుండు.

తా. ఉత్తమ, మగు శివయోగ మార్గమును నాలుగాశ్వాసములచేఁ బ్రకాశింప
జేయుచున్న యీశివయోగ సారమును నెవండు చదువునో, ఎవండు వినునో, వాఁడు సకల
భోగంబుల ననుభవించి శివజ్ఞాన సంపన్నుఁడై విలసిల్లును.

క. అనియిట్లు మీకృప జనియిం
చినమతి రచియించి నాఁడ శివయోగ జ్ఞా
న నిధానంబనఁ గృతిఁ గై
కొనుమిది శ్రీమూకనార్య గురుగుణధుర్యా. ౩౧౯

తా. ఓమూకనారాధ్యా, మీకృపవలన నాకుఁగలిగిన బుద్ధిప్రభావంబున శివయోగ
జ్ఞాననిధానమను నీకృతిని రచించితిని. గైకొనుము.

ఆశ్వాసాంతము.

స్రగ్ధర.
గ్రహరాజాబ్జారి సంగ ప్రకటిత దివసప్రాప్తిమత్పూర్ణిమాఖ్యా
సహితోర్ధ్వాలోక నాచంచల పవనమున శ్శాంభవీఖేచరీప
స్పృహాముద్రాభ్యాస దృష్టాసితజలదతటిస్నిగ్ధసావిన్మయోద్య
త్సహజ శ్రీలింగ సేవాజనిత సదమనస్స్ఫూర్తిరానందమూర్తీ!

తా. సూర్యచంద్ర సంగమమునఁ బ్రకటింపఁ బడిన దివసప్రాప్తి గలిగి పూర్ణిమ
తోఁ గూడిన యూర్ధ్వాలోకంబున జలింపని మనస్సుచే శాంభవీ, ఖేచరీముద్రాభ్యాస
మునఁ జూపఁబడిన నీలమేఘమునందలి తటిత్కాంతివలె నేది విలసిల్లునో, అట్టిచిన్మయలింగ
మును సేవించుటవలన జనించిన యమనస్కముచేత నిత్యానందముచే శోభిల్లుచున్నవాఁడా!

క. కమలాహిత వైశ్వానర
కమలహితాలయ సమీర కలిత మనోదృ
క్సముదిగ తాపోజ్జ్యోతి
ర్విమలాకారాత్మలింగ విజితానంగా. ౩౨౧

టీ. సూర్యాగ్ని మండలము లందలి వాయువుతోఁ గూడిన మనోదృక్కుచేఁ గను గొనఁబడిన యాపోజ్జ్యోతిరే యాకారము గాఁగల యాత్మలింగము గలవాఁడా! మన్మథుని జయించినవాఁడా!

మాలిని.

సదభినుత సువేషా సాధితారక్తిదోషా
చిదమృత పరితోషా క్షీణదుర్మోహరోషా
విదిత ఘనమనీషా నిస్ఫురత్సత్యభాషా
విదళిత భవరోషా పీరశైవైకభూషా. ౩౨౨

టీ. సత్పురుషుల చేనుతింపఁబడిన వేషముగలవాఁడా, సాధింపఁబడిన వైరాగ్యము గలవాఁడా, చిదమృతపానముల సంతోషించువాఁడా, మోహరోషములులేని వాఁడా, ధీమంతుఁడా, సత్యవాక్కులుగలవాఁడా, సంసారమునం దభిలాషలేక, వీరశైవమున్నమై వెలయునో నాకనారాధ్యా! యీకృతిని స్వీకరింపుము.

గద్య

ఇది శ్రీగురు చెన్న సదాశివ యోగీంద్ర పదారవింద మధుకరా
యమాన నిరంతర శివభక్తి సమాధాన కొలనియారాధి మూ
లనామాత్య పుత్ర అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతి సు
ముఖ సుకవిజన మిత్ర సరస కవిత్వ రచిత ప్ర
భావ గణపతిదేవ ప్రణీతంబైన శివయో
గ సారంబునందు నుత్తర భా
గమునందు సర్వంబును
చతుర్థాశ్వాసము.
సంపూర్ణము.



వలన నాకాశమును, ఆకాశము వలన వాయువును, వాయువు వలన నగ్నియు, నగ్ని వలన జలము జలము వలన భూమియు, గలిగెను.

ఈపంచ భూతములును, మూలప్రకృతియొక్క సత్వరజస్తమో గుణములతో గూడికొని సత్వగుణాత్మ పంచభూతములు, రజస్సాత్మ పంచ భూతములు. తమస్థూల భూతములు, అనిమూడు విధములుగ వచింపఁ బడుచున్నవి.

## సాంఖ్యము.

సాంఖ్యమనఁగా సంఖ్యచేత విభాగింపఁ బడినది. దీనికి పంచీకరణమని పేరుగూడఁగలదు. పంచీకరణ మనఁగా విస్తరింపఁ జేయుట. లేక విభాగించుట యని యర్థము. పంచీకరణ సాంఖ్య పదములు సమానముగా వ్యవహరింపఁ బడుచున్నవి.

ఈపంచీకరణము, సూక్ష్మమని, స్థూలమని రెండు విధములు. సూక్ష్మ శరీరోత్పత్తిని దెలియఁ జేయునది సూక్ష్మశరీర పంచీకరణమనియు, స్థూలశరీరోత్పత్తిని దెలియఁజేయునది స్థూలశరీరపంచీకరణమనియుఁ వచింపఁబడును.

## సూక్ష్మశరీర పంచీకరణము

అపంచీకృతములగు సూక్ష్మరజః పంచభూతముల వలన సూక్ష్మశరీర మేర్పడుచున్నది. పంచీకృతములైన తమస్థూల భూతములవలనస్థూలశరీర మేర్పడు చున్నది.

శ్లో॥ పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితం।
అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగంభోగసాధనం।

ఈసూక్ష్మశరీము సత్వరజస్సాత్మ భూతములచే నేర్పడుచున్నది రజస్సత్వభూతములు వ్యష్టి సమష్టి భేదములచే చతుర్విధములు.

సత్వసమష్టి సూక్ష్మభూతములగు నాకాశ,వాయ్వగ్ని జలభూములుగలసియంతఃకరణమగు చున్నది. అంతఃకరణమనఁగా మనోబుద్ధులని భావము

సత్వసూక్ష్మ భూతములగు నాకాశాదులే క్రమముగా శ్రోత్రత్వక్చక్షు జిహ్వ ఘ్రాణములను జ్ఞానేంద్రియములు నగు చున్నవి.

రజస్సాత్మ భూతములకు నాకాశాది పంచక సమూహమున సమాన వ్యానోదాన ప్రాణాపానములు పుట్టుచున్నవి. రజస్సాత్మ భూతములగు నాకాశాదులే ప్రత్యేకముగాఁ గ్రమముగా వాక్పాణి పాద గుహ్యోపస్థలగు కర్మేంద్రియము లయ్యెను.

కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, పంచ వాయువులు, అంతః కరణమునను బదియేడును కలసి సూక్ష్మ శరీర మయినది. కొందరు మనస్సులో నంతర్భూతమగు చిత్తమును, బుద్ధిలో నంతర్భూతమగు నహంకారమును వేరుగాజేసి యీపందొమ్మిది తత్వ.

ములచే సూక్ష్మ శరీరము గలుగు చున్నదని వచించు చున్నారు.

ఈసూక్ష్మ దేహము, హిరణ్య గర్భుఁడు, సూత్రాత్మయనెడి నామాంతరములు గల యీశ్వరునికిని, తైజసుఁడు, స్వప్న కల్పితుఁడను నామములుగల జీవునికిని నిల యమై ప్రాణమయ విజ్ఞానమయ, మనోమయ కోశములను కోశత్రియము తోడను, స్వప్నావస్థ తోడను, విరాజిల్లు చున్నది.

జీవుని సూక్ష్మ శరీర తత్వాధి దేవతలే యీశ్వర సూక్ష్మ శరీర తత్వములుగా వ చింపఁ బడినవి.

## స్థూల శరీరపంచీ కరణము.

తామస స్థూల పంచమహా భూతములు, తామస సమష్టి పంచమహా భూతములని యు- తామస వ్యష్టిపంచమహా భూతములనియు రెండువిధములు.

సమష్టిభూతములు.

| | |
|---|---|
| ఆకాశము. | ౦౪ |
| వాయువు | ౦౪ |
| అగ్ని | ౦౪ |
| జలము. | ౦౪ |
| భూమి | ౦౪ |

వ్యష్టిభూతములు.

| | |
|---|---|
| ఆకాశము. | ౦౪ |
| వాయువు. | ౦౪ |
| అగ్ని | ౦౪ |
| జలము. | ౦౪ |
| భూమి | ౦౪ |

తామస వ్యష్టి పంచమహా భూతముల యర్ధభాగములం దొక్కొక్కటి నాలుగు భాగములుగాఁ జేయఁబడినవి.

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశము. | ౦౪ | భాగము | ౮ భాగములు | చేయబడినది. |
| వాయువు. | ౦౪ | " | ౮ | " |
| అగ్ని | ౦౪ | " | ౮ | " |
| జలము. | ౦౪ | " | ౮ | " |
| పృధివి. | ౦౪ | " | ౮ | " |

తామస సమష్టి స్థూల పంచమహాభూతములలో నొకభూతము యొక్క యర్ధభాగమును, నాలుగు భాగములుగ విభజించఁబడిన వ్యష్టి భూతములలో నొకచిన్న భాగము ను గలిసి పంచీకృత భూతమగును. అట్టిపంచీకృత భూతములచే నేర్పడఁ బడినదియేక రచరణాది విశిష్టమగు నీస్థూలశరీరము

## ఆకాశపంచీకరణము

| ఏభూత సమష్టి వ్యష్టి భాగము. | ఏ గుణము లేక ఏభూత వ్యష్టిభాగము నాల్గవభాగముతో గూడుకొని | ఏతత్త్వమైనది | విషయము | అధిదేవత |
|---|---|---|---|---|
| సమష్టి ఆకాశము 0½ | తమోగుణము | జ్ఞాత | జ్ఞేయము | ప్రత్యగాత్మ |
| వ్యష్టి ఆకాశము. 1వ భాగము. | వాయువు 1వ భాగము | మనస్సు | సంకల్పవికల్పము | చంద్రుడు |
| ,, 2వ భాగము. | అగ్ని 1వ భాగము. | బుద్ధి | నిశ్చయము. | బృహస్పతి |
| ,, 3వ ,, | జలము 1వ ,, | చిత్తము. | చంచలత | క్షేత్రజ్ఞుడు |
| ,, 4వ ,, | పృథివి 1వ ,, | అహంకారము | అభిమానము | రుద్రుడు |

## వాయు పంచీకరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సమష్టి | వాయువు 0½ | తమోగుణము | వ్యానవాయువు | తిన్నపదార్థముల శరీరమంతటను వ్యాపింపజేయును. | విశ్వయోని |
| వ్యష్టి | ,, 1వ భాగము. | ఆకాశము 1వ భాగము | సమానవాయువు | పచనము జేయును. | జఠరుడు |
| ,, | ,, 2వ ,, | అగ్ని 2వ ,, | ఉదానవాయువు | గ్రహణాగ్రహణములు | అజుడు |
| ,, | ,, 3వ ,, | జలము 2వ ,, | ప్రాణవాయువు | ఉచ్ఛ్వాసనిశ్వాస విసర్జనము. | విశిష్టుడు |
| ,, | ,, 4వ ,, | భూమి 2వ ,, | అపానవాయువు | మలమూత్రవిసర్జనము | విశ్వకర్త |

## అగ్ని పంచీకరణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| సమష్టి | అగ్ని 0½ | తమోగుణము. | పాయ్వింద్రియము | మలవిసర్జనము. | మృత్యువు. |
| వ్యష్టి | అగ్ని 1వ భాగము. | ఆకాశము 2వభాగము. | శ్రోత్రము | శబ్దగ్రహణము | దశదిక్కులు |
| ,, | ,, 2వ ,, | వాయువు 2వ ,, | త్వక్కు | స్పర్శగ్రహణము | వాయువు |
| ,, | ,, 3వ ,, | జలము 3వ ,, | జిహ్వ | రసగ్రహణము. | వాయువు |

„ „ 4వ „ పృథివి 3వ „ ఘ్రాణము గంధగ్రహణము. అశ్వినీదేవతలు

## జలపంచీకరణము.

సమష్టి జలము॥ తమోగుణము. రసతన్మాత్రము. మాధుర్యము. విష్ణువు

వ్యష్టి జలము 1వభాగము. ఆకాశము 3వ భాగము. శబ్దతన్మాత్రము. ఏకదేశ శబ్దము. సదాశివుడు

„ జలము 2వ „ వాయువు 3వ భాగము. స్పర్శతన్మాత్రము. ఏకదేశస్పర్శము మహేశ్వరుడు

„ „ 3వ „ అగ్ని 3వభాగము. రూపతన్మాత్రము. ఏకదేశరూపము. రుద్రుడు.

„ „ 4వ „ పృథివి 4వ „ గంధతన్మాత్రము. ఏకదేశగంధము బ్రహ్మ

## పృథివీ పంచీకరణము.

సమష్టి పృథివి ౦॥ తమోగుణము. పాయ్వింద్రియము. మలవిసర్జనము మృత్యువు

„ „ 1వ భాగము. ఆకాశము. 4వ భాగము. వాక్కు వచనము. పుణ్యపాప మిశ్రి అగ్ని

„ „ 2వ „ వాయువు 4వ భా హస్తము నానాప్రతిగ్రహము. ఇంద్రుడు

„ „ 3వ „ అగ్ని 4వ „ పాదములు. రాకపోకలు. ఉపేంద్రుడు.

„ „ 4వ „ జలము 4వ గుహ్యము. సంయోగానందము. ప్రజాపతి

ఇంతవరకును సమష్టివ్యష్టిభూత సంయోగము వలన నెటుల స్థూలశరీర మేర్పడెనో వివరింపఁబడెను. ఇందలిజ్ఞాత యే విధముగా వస్తువుల గ్రహించునది చెప్పఁబడుచున్నది.

## ఆకాశతత్వ సమూహము.

అజ్ఞాన కూటస్థుఁడను నధి దేవతచేఁ బ్రేరేపింపఁబడి సమాన వాయువులోఁగూడికొని శ్రవణేంద్రియ ద్వారా శబ్ద గ్రహణ మొనర్చుచు వాగింద్రియమున వదింపుచుండును కూటస్థుఁడనినను బ్రత్యగాత్మయనినను నొకటియే.

## * వాయుతత్వ సమూహము. *

జ్ఞాత మనోరూపుఁడై చంద్రాధి దేవతచేతఁ బ్రేరేపింపబడి వ్యాన వాయువుతోఁ గూడికొని త్వగింద్రియ ద్వారా స్పర్శల గ్రహించుచు పాణీంద్రియము చేత స్పృశించుచుండును.

## అగ్నితత్వ సమూహము.

జ్ఞాత బుద్ధి రూపుఁడై బృహస్పత్యధి దేవతచేఁ బ్రేరేపింపఁబడి ఉదాన వాయువు తో గూడుకొని నేత్రేంద్రియ ద్వారా రూపము గ్రహించుచుఁ బాదేంద్రియమున నడుచు చుండును.

## జలతత్వ సమూహము.

జ్ఞాత చిత్తస్వరూపుఁడై క్షేత్రజ్ఞాధి దేవతచేఁ బ్రేరేపింపఁబడి ప్రాణవాయువుతో గూడి జిహ్వేంద్రియ ద్వారా రసగ్రహణ మొనర్చుచు గుహ్యేంద్రియ ద్వారా మూత్రవిసర్జనము శుక్లశోణిత విసర్జనము చేయుచు సంభోగములనందానందించు చుండును

## పృథివీతత్వ సమూహము.

జ్ఞాత అహంకార రూపుఁడై రుద్రాధి దేవతచేఁ బ్రేరేపింపఁబడి యపానవాయువుతో గూడి ఘ్రాణేంద్రియ ద్వారా గంధము గ్రహించుచు, పాయువింద్రియ ద్వారా మలవిసర్జనము చేయుచుండును.

## ప్రకృతిలయము.

పంచమహా భూతముల సమష్టివ్యష్టి భాగములఁ గూడికచేత నిరువదియైదు తత్వములు కలిగెను. ఏభూతముయొక్క వ్యష్టిభాగము నాభూత సమష్టిభాగముతోఁ గలసినచో పంచమహా భూతములే నిలుచును.

పృథివి జలమందును- జలమగ్నియందును- అగ్ని వాయువు నందును, వాయువాకాశమందును- ఆకాశ మహంకారము నందును, అహంకారము మహత్తత్వ మందును మహత్తత్వము మూలప్రకృతియందును, మూలప్రకృతి నిర్గుణ పరబ్రహ్మ మందును జేరనప్రకృతి లయమగును.

## భేదములు.

మూలప్రకృతియే బలసిన మహత్తత్వమనని కొందఱును- మూలప్రకృతివేరు. మహత్తత్వమువేరని కొందఱును వచింతురు.

సృష్టిక్రమము కొన్ని గ్రంథములందు- అవ్యక్తమువలన మహత్తత్వముదానివలనయహంకారమును నహంకారము వలన పంచ తన్మాత్రలును- పంచతన్మాత్రలవలనపంచభూతములును జనించినవి.

## జీవన్ముక్తుఁడు.

అనగా, బ్రతికి యున్నపుడే దేహముతో ముక్తినొందు వాఁడు. మనోలయ మీతనికిఁ గలుగును ఇది స్వరూపలయము— అరూపలయమని ద్వివిధము.

## విదేహ ముక్తుఁడు.

అనగా, దేహము విడిచిన పిదపముక్తి నొందిన వాఁడు. అరూప లయ మీతనికి గలుగును. కాలిన గుడ్డ గాలిచే నెగిరి పోవు నటుల ప్రారబ్ధము దేహముతో నశించుటయే యరూపలయమనఁబడును.

## ఆగామి సంచిత ప్రారబ్ధ వివరణము.

మనము సంపాదించి నిలువ చేసికొనిన ధనమువలె నిదివరలో సంపాదించి కొన్న పుణ్యపాపకర్మములు సంచితమని వచింపఁ బడును. ఆధనములో గొంత దీసికొని యిప్పుడనుభవించు చందంబునఁ గర్మములలోఁ గొంత యనుభవించు చుండుటయే ప్రారబ్ధ మనఁబడును. ముందుకు సంపాదించి కొనుచున్న ధనమువలె కర్మము లొనర్చి పుణ్యపాపఫలంబుల సమకూర్చు కొనుట యే యాగామి యనఁబడును.

ప్రారబ్ధము ఇచ్ఛా ప్రారబ్ధము- అనిచ్ఛా ప్రారబ్ధము- పరేచ్ఛా ప్రారబ్ధము_ అని మూడువిధములు. తన యిచ్ఛచే జేయు పుణ్యపాపకర్మలు యిచ్ఛా ప్రారబ్ధ మనియు పరుల యిచ్ఛచేత జేయునవి పరేచ్ఛాప్రారబ్ధ మనియు, పిడుగు పడుట-వ్యాధులువచ్చుట మొదలగునవి దైవేచ్ఛచే వచ్చునవి గనుక యనిచ్ఛా ప్రారబ్ధమనియు వచింపఁబడును.

"ప్రారబ్ధంబలవత్తరం ఖలు నృణాం భోగేన తిష్యత్యయః" యనియుఁ "ప్రారబ్ధం భోగతో నశ్యేత్ తత్త్వజ్ఞానేన సంచితం ॥ ఆగామి ద్వివిధం కర్మ తద్వేషి ప్రియ వాదినోః" యనియు- చెప్పుటచేత ననుభవము వలనగాని ప్రారబ్ధము నశించ దనియు- తత్త్వజ్ఞానము కలిగిన నాగామి సంచితములు నశించు ననియు వచింపఁ బడినది. ఇవియన్నియు నహంకారమునకేగాని, అహంకార రహితుఁడగు నాకులేవని యెరుంగు వాఁడేముక్తుడు.

ఇంతవరకు శుద్ధాద్వైత మార్గమును సరించి సిద్ధాంతము వ్రాయఁ బడినది. ఈశివ యోగసారోత్తర భాగమున ప్రథమాశ్వాసము నందు సృష్టి క్రమము శైవ సాంప్రదాయమును స్మరించి చెప్పఁ బడినది. శైవుల తత్త్వములు ముప్పదియారని చెప్పుటయగాక తత్త్వరూపము గూడ నిరూపింపఁ బడినది. గాన నచ్చట చూచు కొన వలయును. మఱియు- శివాద్వైత తత్త్వత్రయమునగూర్చి యిచ్చట నరొక విధముగావచింపఁ బడు చున్నది.

## శైవ తత్త్వ విచారము.

తత్త్వములు శివ సదాశివ మహేశ్వర భేదమున త్రివిధములు శివతత్త్వము నిష్కలమనియు సదాశివతత్త్వము సకలనిష్కలమనియు-మహేశ్వరతత్త్వము సకలమనియు వచింపఁ బడును

# శివయోగసారము.

శివతత్వ మొకవిధము. సదాశివతత్వము ౫ విధములుగ, మహేశ్వర తత్వము ౨౫ విధములుగను జెప్పఁబడినది. మొత్తము ౩౧ తత్వములు

శివుని యందపృథగ్భావమున నున్న శక్తి క్షోభ మాత్రమున సహస్రాంశ గలిగిన పరాశక్తి జనించెను. పరాశక్తి సహస్రాంశమున ఆదిశక్తియు - ఆదిశక్తి సహస్రాంశమున ఇచ్ఛాశక్తియు - ఇచ్ఛాశక్తి సహస్రాంశమున జ్ఞానశక్తియు - జ్ఞానశక్తి సహస్రాంశమున క్రియాశక్తియు జనించినవి. ఈ శక్తి పంచకమును - క్రిందటి ఏకత్రింశత్తత్వములను గలసి షట్త్రింశత్తత్వములని వచింపఁబడును.

సదాశివ తత్వము - సదాశివ - ఈశ - బ్రహ్మేశ - ఈశాన భేదముల పంచవిధము. దీనికే శివసాదము - అమూర్తసాదము - మూర్తసాదము - కర్తృసాదము - కర్మసాదము - అను నామములు గలవు సాదమనగా స్వరూపమని యర్థము.

కర్మసాదము పూర్వముఖమగు తత్పురుష రూపమనియు, కర్తృసాదము దక్షిణముఖమగు యఘోర స్వరూపమనియు, మూర్తసాదము పశ్చిమముఖమగు సద్యోజాతస్వరూపమనియు, అమూర్తసాదము ఉత్తరముఖమగు వామదేవముఖమనియు, శివసాదము ఊర్ధ్వముఖమగు నీశానస్వరూప మనియు, నుడువఁబడినది. పంచవక్త్రములతోఁ గూడికొని పంచస్వరూపమైనదియే సదాశివ తత్వమని చెప్పఁబడుచున్నది

మహేశ్వర తత్వమిరువది యైదు విధములు. ఈ తత్వము త్రినేత్రము ఏకముఖము గలిగి సర్వాభరణ సహితుఁడగు నీశ్వరుఁడని వచింపబడినది. పంచవింశతి లీలలునీ మహేశ్వరుఁడే ధరించెను. సృష్టిస్థితిసంహార తిరోధానానుగ్రహాది పంచకృత్యములచే బ్రకాశించు వీనివలననే పంచభూతములు జనించి సూక్ష్మస్థూల శరీరములకు గారణమయ్యెను. శివజ్ఞానశేఖరమున నీ విషయమును గూర్చి విస్తరించి వ్రాయఁబడును.

## అతివర్ణాశ్రమి.

అతివర్ణాశ్రమి అత్యాశ్రమి యను పదములు శైవులకు సాంకేతిక నామములై యున్నవి గావున యతివర్ణాశ్రములనగా శైవులని చెప్పఁదగును.

సమాప్తము.

---

## సవరణ

౫౨వ పేజీనుండి ౧౦౧వ పేజీవఱకు అంకెలు తప్పు పడినవి గావున సవరించుకొనవలెను. ౧౧౬వ పేజీలో ౨౫వ పఙ్క్తిలో "జనించినవి" అను చోట "జనించినవని గలదు." అని సవరించుకొనవలెను.



# గ్రంథమాల యందు ముందు ప్రకటింపఁబడు గ్రంథ రత్నములు



శివరహస్య ఖండము. యుద్ధకాండము ... కోడూరు వెంకటాచలకవి ప్రణీతము.

బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణ కవి

లింగధారణ దీపిక ... మల్లికార్జున పండితారాధ్యుల

... భవానీ శంకరారాధ్యులు

శివజ్ఞాన శేఖరము ... ఘంటనా మాత్యుడు

కాళహస్తీశ విలాసము ... కాళహస్తీశ్వరుడు

మల్లికార్జున పండితారాధ్య చరిత్ర సంస్కృతము

నందికేశ్వర పురాణము

శివరహస్య ఖండము సంస్కృతము అసుర కాండ, వీర మహేంద్ర కాండ, యుద్ధ కాండ, దేవ కాండ, దక్ష కాండ, ఉపదేశ కాండలు వ్యాస మహర్షి ప్రణీతము

శైవసిద్ధాంత దర్పణి 2వ సంపుటము 3వ సంపుటము

శివమహిమ్న స్తోత్రము సవ్యాఖ్యానము మల్లికార్జున పండితారాధ్యుల వీరనారాధ్యులు.

బసవ పురాణము సంస్కృతము వ్యాస ప్రణీతము

శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు

శ్వేతాశ్వతర కల్పసూత్రము శ్వేతాశ్వతరుడు

ఈ గ్రంథము లచ్చు బడుటకు శైవు లందరు తప్పక చందాదారులుగాఁ జేరియు తమమిత్రులను జేర్పియు మాకు ప్రోత్సాహము నిచ్చెదరని నమ్ముచున్నారము. ఇట్లు

సంపాదకులు.

## శైవప్రచారిణీ గ్రంథమాల

ఇందు అముద్రితములు- అనుపమానములు, అమృతప్రాయములు, ఆనంద ప్రదములు నగునాలుగు గ్రంథరత్నములు మూడుమాసముల కొక్కటి చొప్పున ప్రకటింపబడును.

గ్రంథమాల సం॥ చందా రు 4-0-0

---

## శైవప్రచారిణీ పక్షపత్రిక

ఇది ప్రతిపక్షమున ప్రకటింపబడు యొక పత్రికారాజము. ఇందు నీతిబోధకములగు కథలు ఆరోగ్యదాయకములగు వైద్యవిధానములు- లాభకరములగు వర్తకవిషయములు- విజ్ఞానమును వెదజల్లు భాషాపద్ధతులు- వివేకమును గలిగించు చక్కని విమర్శనలు- మతధర్మములు- వ్యవసాయరీతులు స్వదేశవిదేశ వృత్తాంతములు నవ్వుపుట్టించు హాస్యములు-తలనూపించు చమత్కారములు వేయేల! సర్వవిషయములు ప్రకటింపబడును.

చందా సం॥ రు2-0-0

గ్రంథమాల చందాదారులకు సం॥ రు0-8-0 మాత్రమే

వలయువారు

శైవప్రచారిణీ పత్రికా కార్యాలయం

వరంగల్

అన్నివాయువలయును.